# కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు యావజ్జీవసభ్యులు, దేశోద్ధారక, విశ్వదాతృ కళాప్రపూర్ణాదిబిరుదాంచితులు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు శివసాయుజ్యమును బొందిరని వ్రాయుట కెంతయుఁ జింతిల్లుచున్నారము. దేశముమీఁదను పరిషత్తుమీఁదను వీరికిఁ జాల నభిమానము కలుగుటచే నాంధ్రదినపత్రికను, భారతిని, ఆంధ్రపత్రికా ప్రచురణము లగు ననేకగ్రంథములను నుచితముగాఁ బరిషత్తున కొసంగుచుండిరి. వీరికిఁ గళాప్రపూర్ణబిరుదము చిరకాలము క్రిందటనే రావలసినది. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు మొనమొన్న గుర్తించి యీబిరుదము నొసంగిరి. విశ్వదాతృ దేశోద్ధారక బిరుదములు పంతులుగారి స్వార్జితములు. లోకము మహార్థములను బంతులుగారివలనఁ గైకొని యల్పార్థము లగు బిరుదముల నొసఁగినది. "ఇద్ధపుణ్యు నింద్రు గావ్యమ్ము నెఱుఁగుదయ్య" యన్న ట్లీపంతులుగారింగూర్చి యెన్నియుగములు గతించినను లోకమునకుఁ బరాకుండకుండునట్లు వీరే తమ యశస్సును స్థిరముగాఁ జేసికొని చన్నారు. కావుననే లోకము వీరికిటీవలఁ గీర్తిశేషబిరుదమును శాశ్వతము చేసినది. ఈబిరుదము మెప్పుడు నెన్నిజ్ఞాపకచిహ్నములను నెలకొల్పినను నిలువదు. వీరియౌదార్యమును గూర్చి వర్ణించుట సాహసము. కవులు, పండితులు, వ్యాసకర్తలలోఁ బెక్కండ్రు వీరిచేఁ బారితోషికములను బడసి రనుట నిర్వివాదాంశము. ఆంధ్రభాషయందు దినపత్రికను స్థాపించి వీరు మన భాషకును మనకును మహోపకారమును గావించియున్నారు. భాషావిషయకము లగు వ్యాసములను నాంధ్రపత్రిక సారస్వతానుబంధమునఁ బ్రకటించుచుండిరి. మాతృభాషయం దాంధ్రు లెంత యభిమానమును జూపవలయునో, దానియభివృద్ధికై యెటులు పాటుపడవలయునో వీరి ధన్యజీవితము మనకుద్బోధించుచున్నది. వీరియుత్సాహము, కార్యదీక్ష, త్యాగము సర్వజనవిదితములు. ఆంధ్రగ్రంథమాలను స్థాపించి యందు

బసవపురాణము మొదలగు మంచి గ్రంథములను బెక్కింటిని బ్రకటించి యున్నారు. కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిచేఁ బ్రారంభింపఁబడిన యాంధ్రవిజ్ఞానసర్వస్వమును దిరిగి నూతనముగఁ బ్రకటింపఁగోరి రెండు సంపుటములను బ్రకటించిరి. మిగిలినసంపుటములఁ గూడఁ బ్రకటింపవలయు నని యుత్సాహముతో నుండఁగనే కాలధర్మమును జెందిరి. ఆంధ్రపత్త్రికాకార్యాలయమువారు మిగిలినసంపుటములను గూడఁ ద్వరలోఁ బ్రకటించినచో వీరియాశయము సఫలము కాఁగలదు. ఇటీవల వ్యాసకర్తలకును, గ్రంథకర్తలకు నుపయోగించు నటులు పారిభాషికపదకోశము నొకదానిని ముద్రించియున్నారు. అట్టిగ్రంథ మాంధ్రభాషకు మిక్కిలి యుపయోగకరమైనది. శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు తాము వ్యాపారమున నార్జించిన ద్రవ్యమును సద్వినియోగ మొనర్చి ధన్యతను గాంచిరి. వీరియుదారాశయముల మనసునం దుంచుకొని యాంధ్రు లందఱును దమ శక్తికొలఁది నాంధ్రభాషకు నాంధ్రరాష్ట్రమునకును సేవ యొనర్చి కృతకృత్యతను గాంతురుగాత.

కొంతకాలముక్రిందట నొకరు వీరిదానముపై రచించిన కొన్ని పద్యములఁ బాఠకులకై యిందుఁ జేర్చుచున్నారము.

ఉ. దానము సాజమైననిను దగ్గఱ జంకిన దాను లష్టది
గ్యానము సేయ వెంబడి యఖండితతావకకీర్తి యేఁగి య
ద్దానులదాఁకకీర్తి బురదం గలిపించెను వారిచేత నే
దానను మాంద్యతం గనియెఁ దద్గతి యోవరదానమానితా.

ఉ. దాత యొకండు చేముడిచెఁ దావకదానము గాంచి లజ్జచే
దాత యొకండు నిల్వనను దాఁగుచుండెను నీకు సిగ్గునన్
దాత యొకండు డాఁగె వసుధావివరంబున నీవు లేక యీ
దాతలు దాతలయ్యె ఋణదాతలుగాక ధరాతలామరా.

ఉ. దాతలమాఁచు లేచినను దావకదానయశం బదొక్క పెక్
దాతను వీఁపుఁజీల్చె నొకదాతను దస్సలుచెక్కె నొక్కమే

ద్ధాతను బట్టి కోసి చెవులం జమడా యొలిపించె ధాత్రి నీ
దాతలు దాతలయ్య ప్రాణదాతలుగాక ధరాతలామరా.

మ. స్వకతుల్ దాతలమంచుఁ జెప్పుకొనుచున్ హేమాద్రిచందంబుగా
నుపరాగంబుల యక్షు దేవదిపదాబ్జో యుప్పుఁ బప్పిచ్చి; పూ
ర్వపురిబ్యాకుల దాతలందురు శరీరచ్ఛేదనాదిక్ బలే
యుపదానంబులుగావె వారివి భవత్త్యాగంబు మ్రోల న్నృఘీ.

మ. నవదానంబులఁ బ్రాణంబోతులను సన్మానించుఁ, జండాలికిం
జనిమాపుస్తకరేఖ, నాగ మది రహా నాగమ్మ, య ట్లయ్యు హ
స్తవిశేషంబున దానిసేను వెలసెం ద్వద్దానసందర్భము
న విశేషించి వచింపఁబోలునొకో యూకుర్ద్దాని నాగేశ్వరా.

---

# అభిమన్యుపరాక్రమము.

—కట్టా అచ్యుతరామశర్మగారు, విజయనగరము—

---

అభిమన్యుఁడర్జునునికిఁ దగినకుమారుఁడు. ఈతనిసాహసము, ధైర్యస్థైర్యములు, సంగరకౌశలము వర్ణనాతీతములు. ధర్మరాజుపద్మవ్యూహంబర్జునునకుఁదప్ప నన్యులకభేద్యంబగుటఁదెల్పి యాతనిదద్భేదనంబునకు నియోగించుసమయంబున నాతఁడనినమాటలతనిసాహసమును, సహజశౌర్యమును వేనోళ్ళఁజాటుచున్నది. పద్మవ్యూహంబు వెడలునట్టి తెఱంగు తానెఱుంగకున్నను, అభిమన్యుఁడు పెదతండ్రికోర్కె నెఱవేర్పఁబూనుటయందే యాతనిక్షత్రియకులోచితమైన సంగ్రామోత్సాహము తేటపడుచున్నది. అభిమన్యుఁడు భీమునితో నన్న "నరుఁడున్ సుభద్రయున్ దనయునిఁ గాంచి సంతసముఁ దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే" యను వాక్యమాతనినిర్భీకతను నపారపరాక్రమముతోఁ బ్రకాశించుసాహసమును దేటతెల్లము చేయుచున్నది.

యుద్ధము చేయుచోట్ల నభిమన్యుఁడు ప్రదర్శించిన చాతుర్యము, నుత్సాహము, ననన్యసామాన్యములు. ఎందఱెన్ని నిశితసాయకముల నేసినను జంకక వెనుకంజ వేయక తనపై కెత్తివచ్చిన కౌరవయోధుల నందఱ నోడించిన యాతని విక్రమస్ఫూర్తి యిట్టిదని వర్ణింప నలవికాదు. తానొంటరియైనను నెదిరివీరు లనల్పసంఖ్యాకులై యున్నను నించుకేని భయపడక 'జయో వా మృత్యుర్వా' అని యుపారోత్సాహమున సంగరకేళి నొనరించిన యభిమన్యుని ధైర్యపటిమ కొనియాడఁదగి యున్నది. కౌరవవీరు లెంత ప్రఖ్యాతులైనను నభిమన్యుని విక్రమాధిక్యమును జూచి వెఱఁగుతోడి వెఱపునొంది కంపితులైరి. నిజముగాఁ బొంగెడు కౌరవసేనకు వాసవిసుతుఁ డేదిన చెలియలికట్ట విధంబున నుండె ననుటలోను, నతనిచుట్టుముట్టిన పెక్కుబలమ్ములు మహోదధిఁ బోలఁగ నాతఁడు మందరమ్ము చందమ్మున నొప్పె ననుటలోను నత్యుక్తి లేదు.

అభిమన్యుని ధాటి కోర్వలేక పెక్కురు మడియుటయుఁ గౌరవసేన లన్నియు భీతిఁ దెరలుటయు నస్త్రగురుండైన ద్రోణునంతవాఁడు “ అర్జునుఁడును నభిమన్యుఁడును నని నొక్కరూప, చూడం జిన్నవాఁడు కాని యలంతులం బోయెడివాఁడు కాఁడు.” అని వెఱపుతో నాతని నగ్గించుటయుఁ గర్ణునంతటి మహాయోధుఁడు ద్రోణునితో “గాండీవిఁ గలనం గలసి యెఱుంగుదుము కాదె యాతనిచే నింత బెట్టిదంబు కాదని” అభిమన్యుని నర్జునాతిశాయిగాఁ జెప్పుటయు నాతని సంగ్రామకేళీవిజృంభణమును బెక్కుతెఱంగుల వివరించుచున్నది. ఆతఁడు పలువురు యోధు లొక్కుమ్మడిఁ దన్నుఁ జుట్టుముట్టినప్పుడు వెనుకంజవేయకుండుటయే కాక సహాయమునైన నర్థింపలేదు. భీమాదు లనినట్లు తోడుపడ రాలేదని వారిని నిందింపలేదు. ధైర్యముతోఁ గౌరవసేనామహాంభోధినడుమ దుర్భేద్యమగు మందరనగంబుకైవడి నిలిచి తన దోర్విక్రమస్ఫురణంబు తెల్లంబు సేసె.

అభిమన్యుఁడు దుశ్శాసనుని పుత్రులతో ననిన మాట లాతని ధైర్యమున కనుగుణముగా నున్నవి. అతఁడు సంగరంబున నెన్నివిధం

పండితులు వీరిపద్యములపై వారివారియభిప్రాయముల నిచ్చియున్నారు. ముద్రణవ్యయము శ్రీ శ్రీ శ్రీ జయపురముమహారాజావా రొసంగిరి.

క. తనపూర్వజన్మసుకృతము, నను గాక ప్రబంధ మల్లునైపుణ్యము గ
ల్గునె పండితుఁడైనఁ దదో, చినయట్లఁగవిత్వఫణితిసిద్ధిగణపతీ. ౧-౧౨

అని కవిగా రనినది వాస్తవమే.

కొన్నిపద్యములు సంస్కృతమునకుఁ దెనుఁగువి గలవు.

క. కవిత యువనితయు విత్తము, దవులుండితమంతఁదామె వార్తౌన సుఖమా
సవి బలితమున నవచ్చినఁ, జివుకులవున్నాదె జగతి సిద్ధిగణపతీ. ౧-౨౫

వీనిస్వాతిశయసాహిత్యమునకుఁ దగుపద్యము.

క. తెలియని గ్రంథార్థము మా
తెలిసినవారిపతెఁ గవులఁ దెగడుదు రజ్ఞుల్
పలువుర చీవాట్లం బడఁ
జిలిపి ప్రసంగముల జగతి సిద్ధిగణపతీ. ౧-౬౯

క. సిరిమంతులు నోఁడివిన వం, కరమాటలనైన మార్గానరు కాదని ద
గ్గఱ; వారిమొగముగనియే?,సిరిగన్గొని గాని జగతి సిద్ధిగణపతీ.

మా తెలిసిన- తెలిసినవాళ్లు-సిరిమంతులు మొదలయినవి ప్రమాదపతితము లేమో.

నంబుసెడియుంట, నచె, తా
సింహాసనఁ దగులుట జగతిసిద్ధిగణపతీ. పుట 66- ౧30

ఇది యేకవి ప్రసంబోధనవంటిది గాఁబోలును

క. కుంచము కూడంబెట్టిన
మంచము మాయించెనన్న మాద్రి సరియ యా
ర్జించినదొకఁ డైనను వె
చ్చించినదొకఁ డొటఁ బ్రకృతి సిద్ధిగణపతీ. ౨-౮౯

ఇది లోకోక్తి ప్రయోగమున కుదాహరణము.

వీరిసీతిపద్యములు బహువిధముల నుపకరించి వీరిశ్రమమునకుఫలము నొసంగుఁగాక, దీనివెల అణాలు. కవిగారియొద్దనే దొరకును.

## 2. ఆర్యాసప్తశతీసారము.

సికిందరాబాదు మహబూబు కాలేజి తెలుఁగుపండితులు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడినది. గోవర్ధనాచార్య విరచిత సప్తశతిలోనుండి ౪౦౧ పద్యములు మాత్రమే యిందుఁ దెనిఁగించి ముద్రించిరి. కావుననే దీనికి సప్తశతీసార మని నామకరణముచేసిరి. అమరుకకవికృతమగు నమరుకమువలెనే యిదియు నాయికానాయిక ప్రశంసలు గలిగిన శృంగారకావ్యము. ఇందలిపద్యములు కొన్ని తొలుత, భారతి, ఉగాదిసంచికలలోఁ బ్రకటింపఁబడినవి.

గ్రంథము సరస మైనది. శ్రీ శ్రీ శ్రీ వైవముదిన్నె రామారెడ్డిగారికి దీని నంకితముగావించిరి. చక్కనిపద్యములుకొన్ని—

గీ. పల్లవిఁ గూర్చి వర్ణంబుఁ బాడు; వేణు
వల్లి వాయించుఁ; బల్కించు వల్లకిపయిఁ;
జిలుకకొకరికిఁ బాఠంబుఁ జెప్పుచుండు
నీకు నామాక్షరంబు లానెలఁతమిన్న. ౧౨౨

గీ. తనమనసన్న నిదార మాధారముఁ గొని
వ్రేలుచున్నది యువకుఁడా! సాలెపురుగు
కరముఁ బైకెత్తిపట్టిన గాలముతుదఁ
గర్కటమువోలె నల్లదే కాంచుమోయి. ౧౮౩

గీ. తాళఁజాలక క్రేఁగంటితాఁకుఁదలకు
సొమ్మసిల్లె నతండు మార్గమ్మునందె
జందెపుఁబ్రోఁగు వానివంశంబుఁ దెలిపి
రమణి! నీవుఁ జుట్టుకొన్నది బ్రహ్మహత్య. ౯౪

గీ. ఓకురంగమ! మడి వ్రాలియున్న సరస
శాలిమంజరిఁ ద్యజియింపనేల యిపుడు
గఱికతూపులు గఱికవిల్ గఱికమొడలు
గలగఱికమానిసి యితండు వలదు వెఱవ. ౧౧౩

గీ. తొలకరిఁ బరిత్యజించి యాలలితమైన
గిరినితంబంబు, నెదఁ గన్నెమెఱుఁగుఁబోని
జలదమా! సంచరింతువు చదలివీథి
గాలి సోఁకెనె యేమి యీవాలకంబు. ౨౧౮

వెల రు. ౧. సికింద్రాబాద్‌లో 3993 మార్కెట్టువీథి వేంకట్రామా అండు కోలో దొరకును.

—3 మురారిమహాకవి—

కాకినాడ, పిఠాపురము రాజకళాశాలలలో, ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు ఎం. ఏ. గారు రచియించినది. అనర్ఘరాఘవనాటకకర్త యగు మురారికవిం గూర్చిన యనేకవిషయము లిందుఁ జర్చింపఁబడినవి. పలువురు పలువితములుగాఁ జర్చించిన మురారికవివిషయము లిందు విమర్శించియున్నారు. ఈచిన్నిపొత్తము, మొదట కీ. శే. సత్యవోలు కామేశ్వరరాయకవిగారి యనర్ఘరాఘవమునకుఁ బీఠికగా సందుఁజేర్పఁబడినది. తరువాత వేఱుగాఁ బుస్తకరూపమున నేర్పడినది. ఇందు 48 పుటలలో మురారి జన్మాదికను, నివాసస్థానము, కాలము, బిరుదములు, సుభాషితావళులలో నెక్కిన శ్లోకములు, సాహిత్యవాఙ్మయము, మొదలగునంశములు, పూర్వచరిత్రకారులును విద్వాంసులుం జేసిననిర్ణయముల యుక్తాయుక్తతలునిరూపింపఁబడినవి అనర్ఘరాఘవమునకు వ్యాఖ్యానముల నెందఱువ్రాసిరో యెందఱు తెనిఁగించిరో, వ్యాఖ్యానములు నాంధ్రీకృతము లు, వీనిలో నచ్చుపడినవెన్ని యో, యచ్చుపడని వెన్నియో తెలిపియున్నారు. నడుమనడుమ, కామేశ్వరరాయకవిగారి యనర్ఘరాఘవాంధ్రీకరణములోని యౌచిత్యానౌచిత్యములను సూచించుచు వచ్చిరి. మురారికవింగూర్చిన విషయములను విపులముగాఁ దెలియఁగోరువారు దీనిని దప్పక చదువఁ దగును. ఆచార్యులుగారి యథోజ్ఞాపికలలోఁ బరిశీలించువారికి విశేషాంశములు పెక్కులు తెలియవచ్చును.

శ్లో. మురారిపదచిన్తాయాం భవభూతేస్తు కా గతిః
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీకురు.

శ్లో. భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
　మురారిపదచిన్తాయా మిద మాధీయతే మనః.
శ్లో. మురారి పదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు
　మురారిపదచిన్తా చే త్తదా మాఘే మతిం కురు.
వెల ౮ అణాలు.

4. మొయిలు రాయబారము.

ఇది బ్ర. చర్ల గణపతిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. వీరు నారాయణశాస్త్రిగారి కుమారులు. మొయిలురాయబార మనునది కాళిదాసకృత మగు మేఘసందేశమునకుఁ దెనుఁగుపేరు. రాయబారము తగవొక్కటి యున్నది. రాయభారమా! రాజభారమా యని కొందఱు. పలువురు రాయబారమును దెనుఁగే యనుచున్నారు. రాయబారమన దౌత్యము. భారతములోన జయయానము, భగవద్యానము నని కలవు. లోకములో వాడుకయే కాని సంజయరాయబారము, శ్రీకృష్ణరాయబార మని కనఁబడదు. ఉదయనోదయములో-

"భద్రాసనోపరిభాగంబున రాయభారులు సుధీపౌరాణికు
త్రైవిదీశ్వరులు స్నత్కప్రముఖం బ్రధాను"లని కలదు——కొండొకచో-

"కర్ణాటసింహాసనసామ్రాజ్యలక్ష్మీసార్వభౌమ కారుణ్యలబ్ధకొండవీటిప్రముఖనిఖిల దుర్గాధిపత్యాభిరాము బయకార రామప్రధాన సుత్రామ సర్వసర్వాసహాభారభరణ...దక్షిణ భుజా స్తంభుండును...తృణీకృత పంచబాణుండును, దౌవారికాహూయమానావని ధరరాయభారానూత్నోదగ్రతరస్వర వ్యాహారస.కులభవనబహిర్ద్వారుండును"- అనియుంగలదు. పలువురు అంగదురాయబారము. శ్రీకృష్ణురాయబారము నని యీరీతిఁ దప్పుకొనుచున్నారు. పెద్దలు నిర్ణయింతురుగాక. ప్రకృతము నకువత్తము:——

శాస్త్రిగారు మేఘసందేశములోని కథను దీసికొని చక్కగఁ దోఁచిన వృత్తములలో నొక్క శ్లోకమున కొకటిరెండు పద్యములుగా మృదులముగ రచియించిరి.

మ. ఒకనాఁ డాతఁడు సుందరప్రకృతి వీక్షోత్కంఠఁ దైయుండ నం
తకె యాషాఢము తోఁటినాఁడు చటియఁ గాఁగింటిలో గ్రుచ్చికొ
మ్ముకొనన్ డీకొన నాటితేటిన గజమ్ముంబోలె మేఘంబుకం
డకుఁగట్టం గడుదర్శనీయ మయి యర్థాంగిన్ స్మృతిందెచ్చుచున్.

ఈరీతిగా వీరికవనము ధారాళముగాఁ గన్పట్టుచున్నది. స్ఖాలిత్య ము లందందుఁ గలవు. మేఘసందేశాంధ్రీకరణ మెవ్వరికయినను గష్టమే. గ్రంథకర్తల ప్రయత్నము శ్లాఘనీయము. దీనివెల యెనిమిదణాలు. కవి గారియొద్ద నిడుదవోలులో దొరకును.

### 5. కాశ్మీరగ్రంథావళి.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు ఘనతవహించిన శ్రీ శ్రీఅనంతశయన ము, మైసూరు, బరోడా, మద్రాసు దొరతనములవారు తాముతాము లోకోపకారముకొఱకు నుదారభావముతోఁ బ్రచురించుచున్న సంస్కృ తాదిగ్రంథములను బెక్కింటిని దయచేసియున్నారన్న సంగతి పాఠకులకం దఱకు విదితమే. ఈబహుధాన్యసంవత్సర ప్రారంభములో శ్రీరాజరాజే శ్వర మహారాజాధిరాజ కాశ్మీరనరేంద్ర శ్రీహరిసింహాజీ బహద్దరువారి యాజ్ఞానుసారము ప్రాక్తనపరిశీలన కార్యాలయాధ్యక్షులచేఁ బ్రకటింపఁ బడుచున్న కాశ్మీరదేశ శైవసంప్రదాయగ్రంథములు ౧౧ సంపుటముల ను ఘనతవహించిన శ్రీకాశ్మీర ప్రభుత్వముహారు కూడ సత్యుదారభావ ముతో దయచేసియున్నారు. వీరికిఁ బరిషత్తెంతయుఁ గృతజ్ఞతాపూర్వ కాభివందనములఁ గావించుచున్నది.

ఇందులో, నరేంద్రపరీక్షా -షట్త్రింశత్తత్త్వసందోహః- తంత్రసా రః- శ్రీమాలినీవిజయోత్తరతంత్రమ్- శ్రీమృగేంద్రతంత్రమ్- స్పందనిర్ణ యః,-శివదృష్టిః- నేత్రతంత్రమ్, స్తవచిన్తామణిః- మాలినీవిజయవార్తి కమ్- స్వచ్ఛందతంత్రమ్ (7 సంపుటములు) ఈశ్వరప్రత్యభిజ్ఞా- లాగా క్షిగృహ్యసూత్రాణి-శ్రీతంత్రాలోకః- (10 సంపుటములు) మొదలగునవి

ముఖ్యగ్రంథములు. Hindu Realism. Kashmer Shaivism అనునవి యింగ్లీషుపుస్తకములు మహాప్రాంతములోని శైవసంప్రదాయజ్ఞులీగ్రంథములను బలువురు చూచియుండరని తలంచుచున్నారము. దేశోపదేశము, నర్మమాల, యని క్షేమేంద్ర కృతములు గూడ రెండుగలవు- పండితులు పైదొరతనముల వారొసంగిన యుద్గ్రంథములను బఠింతురుగాక యని కోరుచున్నారము.

6. భక్తజీవనము.

శ్రీయుతులు పుతుంబాక శ్రీకృష్ణయ్యగారిచే రచియింపఁబడినది, పెదపాలెము సేవాశ్రమగ్రంథమాలలో నిది మొదటిపూవు. దేశోద్ధరణబుద్ధులు పెదపాలెము సేవాశ్రమమువారు చేయుకార్యములను దప్పక సర్వజనులు గుర్తింపఁదగిన విషయము. ౧. సారస్వతము ౨.కృషి 3.స్వదేశవస్తుప్రచారము నని దీనిలో మూఁడుశాఖ లున్నవి. ప్రస్తుత భక్తజీవనము సారస్వతశాఖలోనిది. శ్రీపుతుంబాక శ్రీకృష్ణయ్యగారు భక్తాంఘ్రిరేణువని వ్రాసికొనిరి గాని భక్తాగ్రేసరు లనవలయును. నైచ్యానుసంధాన మది. వీరి భక్తిపారవశ్యమునకుఁ దగిన వాక్యములతో నీగ్రంథ మిమిడి యున్నది. ఇం దష్టోత్తరశతమితప్రార్థనము లున్నవి. అష్టోత్తరశతమహిమ వేత్తలకు విదితమే. "పరిపూర్ణా! అష్టోత్తరశతనామములచే నిన్ను సంబోధించి యొక్కొక్క నామమున కొక్కొక్క విన్నపమును రచింపవలె నని సంకల్పించి ప్రారంభించితిని. అది నేటితోఁ బరిపూర్ణము గావింపఁజేసితివి.'' అని నూటయెనిమిదవ విన్నపములో నున్నది. కావున నీవిన్నపములు మానవుని హృదయమును భక్తిరసపూరితునిఁ జేయును. ఈవిన్నపములను సేవాశ్రమములోని కర్మకరులచే నిత్యమును జదివింతు రని తలంతుము. ఇది వఱకున్న శ్రీవిష్ణుని యష్టోత్తరశతనామములుగాక యిందలి యష్టోత్తరశతవిన్నపము లితరనామములతోఁ జెప్పఁబడినవని యెఱుంగవలయును. ఈభక్తిరసగ్రంథమును శ్రీకృష్ణయ్యగారు తమతల్లిగారి కంకితము గావించియున్నారు. ఇంతకుమున్ను వీరు "తమ కష్టపరంపరలను భవదీయకీర్తిని ఛందోబద్ధము గావించి యున్నామని రెండవవిన్నపములోఁ

తెల్పికొనినారు. వానిని బాలకులు వినవలసినదే. "నేటి మనోవేగము ఛందోబద్ధము గావించుటకుఁ దావిచ్చుటలేదు. మనసునఁబుట్టిన తలంపు తెల్లని నీకెఱిఁగింపక తప్పదు. అయ్యది పద్యమా గద్యమా యను శంకతో నీకు బనిలేదుగదా. నాకంతకు మున్నే పనిలేదు. ఇంక నాలేఖిని కష్టము కలదు. నమోనమ శ్రీమన్నారాయణా!" అనిరి. నిజమే. ఒక్కొక్క విన్నపమునకు మొదట, శ్రీహరీ! పతితపావనా! కృపావిలోకనా! జగన్నాథా! అని యును గడపట నమోనమశ్శ్రీమన్నారాయణా! అని యును జేర్పఁబడినవి. గ్రంథమూలాగ్రము మృదుమధురపదజాలముతో నిర్దుష్టముగ నున్నది. అర్ధానుస్వారశకటరేఫములను మాత్రము విడచిరి మచ్చునకొక్క విన్నపము:—

గీ. ఆశ్రితజనావనా! నీయాశ్రితుల నీవు చక్కబెట్టక మఱెవ్వరు చక్కబెట్టెదరు? అందుల కనియే నీభక్తుల శిక్షించియు భయపెట్టియు, నరిషడ్వర్గము పొంతబోనీక జాగరూకుడవై గురుడవై పారము నేర్పుచుందువు. ఇతరు లన్ననో నిన్నెఱుఁగరు. నిన్నెఱుఁగని వారిజోలి నీకేల? కావుననే వారిబడి సాగనిచ్చినంతకాలము సాగనిచ్చి పిమ్మట పాపమును ఫలవంత మొనరించుచుందువు. ఆహా! నీయాశ్రితజనావనబిరుదము నీకే చెల్లునుగాక- నమోనమశ్శ్రీమన్నారాయణా!

దీనివెల అయిదణాలు.

---

## సూచన.

చదలువాడ మల్లనకవి కృతవిప్రనారాయణ చరిత్రమును మరల రెండవసారి ముద్రించియున్నారము. ఇందుఁ బ్రథమముద్రణములోని ప్రమాదములుఁ దప్పులుఁ జాలభాగము సవరింపఁబడినవి. ప్రథమముద్రణపీఠికలో లేని విశేషాంశములు ద్వితీయముద్రణ పీఠికలోఁ గలవు. పాఠకులు త్వరపడుదురుగాక!

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

పంచతంత్రములో (౨-౩౫) నీయర్థము గలశ్లోక మున్నది.

"సకృ ద్దుష్టన్తు య స్మిత్రం పునః సన్ధాతు మిచ్ఛతి
స మృత్యు మేవ గృహ్ణాతి గర్భ మశ్వతరీ యథా"

వృశ్చికీ గర్భన్యాయము కూడ నిట్టిదే.

౯౫. వరగోష్ఠీన్యాయము.

పదిమంది యొకచోటఁ గూర్చుండి యొకనికూఁతునకు వరుని నిశ్చయించుటకుఁ జర్చించుట. రఘునాథవర్మ యీన్యాయము నిట్లు వివరించెను.

"గోష్ఠి రన్యోన్యవార్తా వరలాభాయ గోష్ఠి ర్వరగోష్ఠి స్తయా యథా వరవధూబంధూనా మైకమత్యే సతి వివాహరూప మేకం కార్యం నిష్పాద్యతే త థే త్యర్థః"

౯౬. శతపత్రపత్రశతవేధన్యాయము.

నూఱుతామరాకుల నొక్కదానిపైఁ బెట్టి యొకదబ్బనముతో నొక్కమాఱు గ్రుచ్చుట-సూది నూఱాకుల కొకదానితరువాత మఱియొక దానికి గ్రుచ్చుకొన్నను గాలసూక్ష్మత మనకుఁ దెలియకపోవుటవలన నొకపత్రమునను వలెనె దిగును. ఈన్యాయము కువలయానందములో సముచ్చయాలంకారమున కుదాహరణముగా నిచ్చినశ్లోకములో నున్నది.

"బిభ్రాణా హృదయే త్వయా వినిహితం ప్రేమాభిధానం నవం
శల్యం య ద్విదధాతి సా విధురితా సాధ్వీ సమాకర్ణ్యతామ్
శేతే శుష్యతి తామ్యతి ప్రలపతి ప్రమ్లాయతి ప్రేంఖతి
భ్రామ్య త్యుల్లుఠతి ప్రణశ్యతి గళ త్యున్మూర్ఛతి త్రుట్యతి॥
అత్ర కాసాం చి త్క్రియాణాం కించి త్కాలభేదసమ్భవే పి శతపత్ర పత్రశతవేధన్యాయేన యౌగపద్యం విరహాతిశయద్యోతనార్థం వివక్షిత మితి లక్షణానుగతిః"

ఇంతకంటెఁ బ్రాచీనతర మైన యుదాహరణ మీన్యాయమునకు శ్లోకవార్తికములో ౩౧౧ పుటలో నున్నది.

"యత్రప్రదీపప్రభావ్యక్తం సూక్ష్మం నాస్తి తత్ర సః
దుర్లక్షః స్తు యథా వేధః పద్మపత్రశతే తథా"

## ౯౭. అరణ్యరోదనన్యాయము.

అడవిలో నేడ్చుట- నిష్ఫలప్రయత్నము- ఇదియును శవోద్వర్తనన్యాయమును (శవమునకు నలుగుఁ బెట్టుట) సమానములు. ఇవిగాక రఘునాథవర్మ-ఊషరవృష్టిన్యాయము, శ్వపుచ్ఛోన్నామనన్యాయము-బధిరకర్ణజాపన్యాయము, అంధదర్పణన్యాయము మొదలగువానిని జెప్పెను. ఇవి యన్నియు సమానార్థకములే.

## ౯౮. అర్థీ సమర్థో విద్వా నధిక్రియతే.

కోరికగలవాఁడు, సమర్థుఁడు, విద్వాంసుఁడు నైనవాఁడు యజ్ఞాదికర్మల నాచరించుట కధికారి.

ఇది సర్వదర్శనసంగ్రహములో మీమాంసాసిద్ధాంతమునం దున్నది.

"అర్థీ సమర్థో విద్వా నధిక్రియత ఇతి న్యాయేన దర్శపూర్ణమాసాది విషయావబోధమేవ క్షమణా స్తత్త్వబోధే స్వాధ్యాయం వినియుఙ్క్తే॥

శంకరబ్రహ్మసూత్రభాష్యము ౧-౩-౨౫ లో నీన్యాయ ముదాహరింపఁబడినది.

"శాస్త్రం హ్యవిశేషప్రవృత్త మపి మనుష్యా నేవాధికరోతి శక్తత్వా దర్థిత్వా దపర్యుదస్తత్వా దుపనయనాదిశాస్త్రా చ్చేతి వర్ణిత మేత దధికారలక్షణే"

## ౯౯. అర్ధవైశసన్యాయము.

ఒకశరీరములో సగముభాగము కోసివేయుట-రఘునాథవర్మయీ న్యాయము నిట్లు వివరించెను.

"అసంభవవినక్షాయా మర్ధవైశసన్యాయః యథా కుక్కుటీమాంసభోజనకామ స్తత్సన్తతి కామశ్చ కశ్చి ద్యవన స్తద్గ్రీవాదికం ఛిత్వా భుఙ్క్తే ఉదరం చ సంతానార్థం స్థాపయ తీతి తత్త్వార్థః"

కోడిమాంసముం దినఁగోరినవాఁడు దాని మెడ మొద లగునవి కోసి వండుకొని తిని గ్రుడ్లకొఱకు దానిపొట్టను దాఁచుట-

కుమారసంభవము ౪ వ సర్గలో 3౧ వ శ్లోకము.

విధినా కృత మర్ధవైశసం నను మాం కామవధే విముఞ్చతా
అనపాయిని సంశ్రయద్రుమే గజభగ్నే పతనాయ వల్లరీ॥

౧౦౦. ఆదా వన్తే చ య న్నాస్తి వర్తమానేపి త త్తథా.

ఆదియందు అంతమందును లేకపోయిన వర్తమానకాలమందుఁ గూడ నట్లే. శంకరసిద్ధాంతము స్థితి మూఁడువిధములు. ౧ పారమార్థిక సత్యత్వము-ఇది పరబ్రహ్మమందే. ౨ వ్యావహారికసత్యత్వము- ఇది లోక మందే. 3 ప్రాతిభాసికసత్యత్వము- ఇది రజ్జుసర్పము, మృగతృష్ణికాజలము, మొద లగువానియందే. వీనిలో రెండవదానికి మూఁడవదానికి సత్యస్థితి (Real existence) మొదటినుండి కొనవఱకు లేదు. దీనిని గుఱించి రఘునాథవర్మ యిట్లు చెప్పుచున్నాఁడు.

"న స్వాదా వంతే చ య న్నాస్తి వర్తమా నేపి త త్త థేతి న్యాయా ద్వై తుచ్ఛ మేవ ద్వైతం మన్యన్తే తేషాం బ్రహ్మబోధేన సవికృత్యవిద్యాబోధో న స్యా త్తస్య బ్రహ్మస్వరూపనిత్యబోధమహిమ్నా న దైవ బాధితత్వాత్"

౧౦౧. ఉష్ట్రకంటకభక్షణన్యాయము.

లొట్టియ యెల్లపుడు ముండ్లచెట్లనే భక్షించును. దానికిఁ దద్భక్షణమం దున్నప్రీతిచే ముండ్లు గ్రుచ్చుకొనుటవలనఁ గలుగుబాధను గూడ సరకుచేయను. అట్లే సంసారి పుత్రదారాది పోషణనిరతుఁడై ధనార్జనమువలనఁ గలుగుదుఃఖమును లక్ష్యపెట్టక ధనసంపాదనాసక్తుఁడై యుండును.

౧౦౨. బహుసపత్నీకన్యాయము.

అనేకభార్యలు గల యొకగృహస్థుఁడు వారి నందఱ నేక కాలమం దుఁ గామోపభోగతృప్తలనుగాఁ జేయఁజాలక దుఃఖము ననుభవించునో యట్లే పురుషుఁడు విషయోపభోగమం దింద్రియములచే సమాకృష్టుఁ

డై దుఃఖము నొందును. ఇందులకు శ్రీమద్భాగవతము సప్తమస్కంధము లో-ప్రహ్లాదస్తుతియందున్న యీశ్లోకమును జూడుడు.

శ్లో. "జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మావితృప్తా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్
ఘ్రాణోఽన్యత శ్చపలదృ క్క్వచ కర్మశక్తిః
బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునన్తి"

## ౧౦౩. సుప్తప్రబుద్ధన్యాయము.

నిద్రించి లేచినవాఁడు.

జాతిస్మరులైనఋషిపుంగవు లదృష్టవిశేషమువలనఁ గల్పాంతరానుష్ఠిత కర్మోపాసనాబలముచేఁ బొందఁబడి బ్రహ్మత్వాధికారము గలవారై కల్పాంతరమందున్న వేదమునుసుప్తప్రబుద్ధన్యాయముచే మరల స్మరింతురు. శుక్లయజుర్వేదమంత్రభాష్యమందు, ఉవ్వటుఁడీయర్థము నే యిట్లు చెప్పెను.

"తథాహి; పూర్వస్మిన్ కల్పే విశిష్టకర్మజనిత స్మృతిసంస్కారసంతానానుచ్ఛిత్తిధర్మాణః సుప్తప్రబుద్ధన్యాయేన హిరణ్యగర్భప్రభృతయః కల్పాదౌ సహవిద్యయా అభివ్యజ్యమానాః స్మర్తారో ద్రష్టారః ఋషయ ఇత్యుచ్యన్తే."

## ౧౦౪. యః కల్ప స్స కల్పపూర్వకః.

ఒక బ్రహ్మకల్పమునకు మఱియొక బ్రహ్మకల్పము ముందుండును. ఈరీతిగా సంసార మనాది. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు గావునఁ గడచిపోయిన కల్పమందున్న వేదము నీకల్పమందు స్మరించి బ్రహ్మాదుల కుపదేశించును.

## ౧౦౫. క్షీరదగ్ధజిహ్వాన్యాయము.

వేఁడిపాలు త్రాఁగుటచేఁ గాలిన నాలుక గలవాఁడు మజ్జిగను ముఖమారుతముచే నూఁదికొని త్రాగును. "ఎలుఁగుబంటిచే దెబ్బలు దిని మంగలము చూచి బెదరినాఁడు" అనుసామెత దీనికి సరిగా నున్నది.

## ౧౦౬. పుష్కరపలాశన్యాయము.

పుష్కరపలాశ మనఁగాఁ దామరాకు. దీనికి నీళ్లతడి యంటదు.

ఈరీతిగానే యహంకార మమకార రహితుఁడైన జ్ఞానికి సాంసారికభావము లంటవు- "స్పృశ్యతే న పాపేన"—

౧౦౩. ఊర్ణనాభిన్యాయము.

ఊర్ణనాభి యనఁగా సాలెపురుగు. ఇది తనలోనుండి పెద్దసూత్రములను బైటికి దీసి కట్టి దానిని మఱల లోనికి వేయును. అయినను నిర్వికారమై యుండును. అట్లే సర్వేశ్వరుఁడుకూడ తనయందే సకలచేతనాచేతనాత్మక ప్రపంచమును బైటికి బెట్టి మఱల దానిని గ్రసించి నిర్వికారుఁడై యుండు నని సాలెపురుగు నుపమానముగా నీశ్వరుని కీదృష్టాంతములోఁ జెప్పఁబడినది. "యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ తథాక్షరాత్సంభవతీహ విశ్వమ్"

౧౦౪. వినా మలయ మన్యత్ర చన్దనం న ప్రరోహతి.

మలయపర్వతమందుఁ దక్క మఱియొకచోటఁ జందనవృక్షము మొలవదు. పండితుఁడు గుణజ్ఞుఁడైనగొప్పవాని నాశ్రయించి యౌన్నత్యమును బొందును గాని యల్పు నాశ్రయించుటచేత గొప్పవాఁడు కానేరఁ డనువిషయమం దీన్యాయము ప్రవర్తించును.

౧౦౫. ఆఖున్నపిటన్యాయము.

ఆఖు=ఎలుక- అన్నపిట=అన్నపుగిన్నె.

ఎలుక యన్నపుగిన్నెను ప్రొయ్యిమీఁదినుండి క్రిందికిఁ ద్రోసివేయుటకే నేర్పు కలది గాని దానిని సరిగాఁ బెట్ట నేరదు. అట్లే దుష్టుఁడు పరకార్యమును బాడుచేయుటయే నేర్చును గాని బాగుచేయలేఁడు. ఈ యర్థమునే యీ క్రిందిశ్లోకము చెప్పుచున్నది.

"నాశయితు మేవ కుజనః పరకార్యం వేత్తి న ప్రసాధయితుమ్ ।
పాతయితు మేవ కుశలో హ్యాఖు ర్నోద్ధర్తు మన్నపిటమ్"

౧౦౬. సూచీముఖిన్యాయము.

ఒక యడవిలో జమ్మిచెట్టుపై నారణ్యచటకమిథునము నివసించుచుండెను. ఒకదినమందు శీతకాలములో ముసురుపట్టి వర్షము కురియుచుండఁగా నొకకోఁతి చలిచేత గడగడ వడఁకుచు నాజమ్మిచెట్టు మొదటకు

వచ్చి కూర్చుండెను. అంతలో నాఁడుపిచ్చుక కోఁతిని జూచి "అయ్యా! నీవు మనుష్యునివలెఁ గాలుసేతులు గలవాఁడవై యుండియు నొకనివాస గృహమును నిర్మించుకొనక యిట్లుల శీతబాధ నొందెదవు" అని పలికెను. వానరమామాటలాలించికోపముదెచ్చుకొని యాచెట్టుమీఁదికిఁ బోయి పాప మాపక్షి దంపతు లుండుగూడను నశింపఁజేసెను. దుష్టులకెన్నఁడు నుపదేశము చేయఁగూడ దనువిషయమం దీన్యాయము ప్రవర్తించును.

౧౧౦. విక్రీతే కరిణి కి మఙ్కుశే వివాదః.

ఏనుఁగు నమ్మివేయఁగా నంకుశమం దేల వివాదము. గొప్పవిలువ గల వస్తువు పోఁగా క్షుద్రవస్తువుకొఱకుఁ బెనఁగులాడుట బుద్ధిహీనత.

౧౧౧. శృఙ్గగ్రాహికాన్యాయము.

శృఙ్గస్య గ్రహణం యస్యాం క్రియాయాం సా శృఙ్గగ్రాహికా। కొమ్ము పట్టుకొని పైకి లాగుట. గోవులమందలో "అయ్యా! నాయావేది" యని గొల్ల నడుగఁగా వాఁడు దానికొమ్ము పట్టుకొని గుంపులో నుండి పైకి లాగి యిది నీయావని కనఁబఱచును.

౧౧౨. సహైవ దశభిః పుత్రైర్భారం వహతి గర్దభీ.

(పదిపిల్లలు గలదియైనను గాడిద తానును మూటలు మోయుట)

ఆఁడుగాడిద పదిమందిపిల్లలతో బరువు మోయుచున్నది. పిల్లలున్నను వానివలన నుపయోగము లేనివాఁడై తా నొక్కఁడే కష్టపడు వానివిషయమై యీన్యాయము ప్రవర్తించును. ఇది తంత్రవార్తికమునుండి గ్రహింపఁబడినది.

"సహకారిత్వం చ కర్మణాం న కార్యే విద్యాయాః కిం తూత్పత్తౌ కోఽర్థో విద్యాసహకారిణి కర్మణీత్యయమర్థః। సత్సు కర్మసు విద్యైవ స్వకార్యే వ్యాప్రియతే। యథా సహైవ దశభిః పుత్రైర్భారం వహతి గర్దభీ। సత్స్వేవ దశపుత్రేషు సైవ భారస్య వాహి :" ఇతి.

౧౧౩. సుభగాభిక్షుకన్యాయము.

ఒకసుందరమైనస్త్రీ, మఱియొక సన్న్యాసి-వీరుభయులుఁ దమ్ముం జంపుటకు వచ్చిన వానివలన భయపడి మార్గములో నొకనిని శరణుచొ

ష్టిని. వాడు తనయజమానుని స్తుతిని విని యోగవశించి వానిపుత్రిని గొంతసేపు కాపాడెను. కాని తరువాత పరము కానిసమయములో సుందరిని రక్షించి సన్యాసిని శత్రువునకు విడిచిపెట్టెను. ఇచ్చట రక్షకునియిచ్ఛయే కారణము.

“యథా ప్రవృత్తే ర్జీవనవత్త్వా ఉభయోః ప్రామాణ్యే పౌరుషేయత్వే
న్యాయప్రమాణాపేక్షతయా ధర్మాదౌ తదభావా దప్రామాణ్యే వాసం
ప్రాప్తే పృష్ఠభాగే త్వాకేచ్ఛవ నియామికే త్యర్థ మాహుః”

౧౧౮. స్ఫటికలౌహిత్యన్యాయము.

ఎఱ్ఱని పుష్పస్ఫటికము దగ్గఱనుంచఁగా దానిమెఱుపు దీనికి సంక్రమించి స్ఫటిక మెఱ్ఱఁబడును. అట్లే యంతఃకరణసాన్నిధ్యముచే నాత్మను సుఖదుఃఖాదు లెక్కుచు ఈదృష్టాంతము వేదాంతశాస్త్రమునందు దఱచుగా నుదాహరింపఁబడును.

పరమార్థసారములోని ౧౬-౨౧ శ్లోకములను జూడుఁడు-

“నానావిధవస్తూనాం వర్ణాన్ ధత్తే యథామలః స్ఫటికః।
తద్వదుపాధే ర్గుణభావితస్య భావం విభు ర్ధత్తే”

౧౧౯. ఆసితోఽసి వణిజః ప్రతిదినం పత్రలిఖిత శ్వస్తనదినభక్షణన్యాయః.

సొమ్మిచ్చుట కిష్టములేనికోమటి రేపిచ్చెద నని పత్రము వ్రాయుట చెప్పుట- ఈన్యాయము మల్లిషేణుఁడు వ్రాసిన స్యాద్వాదమంజరి ౧౦౦ వ పుటలో నున్నది.

“సౌగతాః కిలేత్థం ప్రమాణయన్తి సర్వం సత్ క్షణికం యతః సర్వం తావ ద్ఘటాదికం వస్తు ముద్గరసన్నిధౌ నాశం గచ్ఛ ద్దృశ్యతే— తత్ర యేన స్వరూపేణ అన్త్యావస్థాయాం ఘటాదికం వినశ్యతి తచ్చే త్తత్స్వరూప ముత్పన్నమాత్రస్య విద్యతే—తదానీం ఉత్పాదానంతరమేవ తేన నష్టవ్య మితి వ్యక్త మస్య క్షణికత్వం అథేదృశ ఏవ స్వభావః తస్య హేతుతో జాతో యత్కి యంత మపి కాలం స్థిత్వా వినశ్యతి—ఏవం తర్హి ముద్గరాదిసన్నిధానేపి ఏష ఏవ తస్య స్వభావ ఇతి పునర ప్యనేన తావంతం కాలం స్థాతవ్య మితి నైవం

వినశ్యేదితి హేయ మాదిత్యో; పంశితః ప్రతిదినం పత్రలిఖిత శ్వస్తన దినభంజనన్యాయః"

## ౧౧౩. అధికరణసిద్ధాన్తన్యాయము.

ఒకసిద్ధాంతమువలన తెలియఁజేయు మఱియొకసిద్ధాంతము - తార్కికరాక్షసియను గ్రంథములో ౧౧౯-౧౨౩ పుటలలో నీన్యాయమున్నది.

"యుగపత్ జ్ఞానానుత్పత్తిః మనసో లిఙ్గ మితి—ఏవం చ అణుత్వమేవ మనసః సిద్ధిః అన్యథా యుగప దనేకేంద్రియాధిష్ఠానాత్ యుగపద్ జ్ఞానోదయసంగాత్"

ఇందుపైని మల్లినాథుఁ డిట్లు వ్యాఖ్యానము చేయుచున్నాఁడు.

"ఏవం చేతి"—జగత్కర్తుః సర్వజ్ఞత్వాదివత్ మనసోఽణుత్వ మధికరణసిద్ధాన్తన్యాయాత్ ధర్మిగ్రాహకాదేవ సిద్ధ మిత్యర్థః"

## ౧౧౪. అనధీతే మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ<br>అధీతేపి మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ.

మహాభాష్యము చదువనియెడఁ బదమంజరి చదివిన నుపయోగము లేదు. మహాభాష్యము చదివినపిదపఁ బదమంజరితో నవసరము లేదు.

ఈన్యాయము గణపతిభక్తులు గణపతిని బూజించిన యెడలఁ గలుగు నని చెప్పుచున్న విషయము నుదాహరించుటకు రఘునాథుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు.

"అతః శ్రేయస్కామైః సర్వై రపి సదా ఆరాధ్యః తత్పూజాం వినా అన్యపూజాయాః వైయర్థ్యస్మరణేన ఫలజనకత్వాయోగాత్ అవశ్యాపేక్షితా నపేక్షితయో రపేక్షితం స్మరణీయ మితి న్యాయేన కృతాకృతప్రసంగీ యో విధిః స నిత్య ఇతి న్యాయేన చ తదారాధనస్య ఆవశ్యకత్వాత్ కృతేచ తస్మిన్ "విద్యార్థీ లభతే విద్యాం ధనార్థీ లభతే ధనం। పుత్రార్థీ లభతే పుత్రాన్ మోక్షార్థీ పరమం పద" మిత్యాది వచనేభ్యః సర్వేష్టలాభసంభవేన అనధీతే మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ అధీతేపి మహాభాష్యే వ్యర్థా సా పదమఞ్జరీ.

౫. జయభద్రరగడ.

ద్విరదగతి రెట్టింప వెలయు జయభద్ర మగు
విజయకేతన లసద్విఖ్యాత వరమూర్తి
శరశారదాశేషశయశయదరసూన
శరశత్రుహాయసితచ్ఛరదభాసురకీర్తి. ౧౩౬

౬. మధురగతిరగడ.

కరువలిపట్టిని గవి యీరగడను
వరమతిత్రోమత వైఖరిఁ బొగడను
గరియతి సలభసగగములసంతతి
హరిగతిలో నగ మగును మధురగతి. ౧౩౭

౭. హరిగతిరగడ.

చుక్కలు మొలపూసలుగాఁ బెరిఁగిన
సురగిరిసమధృతి దీనావనమతిఁ
జక్కగ హనుమంతుని నతిశాంతుని
సన్నుతిసేసెద నే నేర్చినగతి
జగణముచొరని చతుర్లఘుగణములు
చరణాంబెన్మిదిగా నృపలఘుమతిఁ
దగులగ నమరించుక సుకవీశ్వర
తతి యానని మెచ్చఁగ నిటు హరిగతి. ౧౩౮

౮. హరిణగతిరగడ.

విహగళాత్మజ వినుము ముదమున
వృషభగతి నగ మిడిన పదమున
విరతి గిరులను వెలయు నుంచఁగ
హరిణగతి యగు నార్యు లెంచఁగ. ౧౩౯

౯. వృషభగతిరగడ.

శ్రీమదుజ్జ్వలకీర్తిమంతుని శ్రీహనూమంతుని భజించెద
రామభక్తవనీవసంతుని రమ్యశాంతనిశాంతు నెంచెద

ననుచు గగభసనలలునాలుగు నర్తుతో నొకటొకటి గూడుక
విన జతుర్దశలఘులయతులను వృషభగతి యనఁదగును వేడుక. ౧౮౦

—౯ యక్షగానలక్షణము ౯—

సీ. వృషభగతి త్రిపుట రేకంప్రియుగ మగుఁ
దుద నేడులఘువులు తొలఁగఁజేయ
జంపెరేకునకు లక్షణము ద్విరదగతి
యగుఁ గొన నొకలఘు వందు మాన
రచ్చరేకగును దురగవల్గనముగతి
మఱి యేకతాళి యగా మధురగతిని
అటతాళమున మాత్ర లంఘ్రి కిర్వదినాల్గు
నాల్గిట విరతి పద్మాలుగింట
నిలుచు నర్ధంపు నర్ధచంద్రికలు దీన
యక్షగానాదికృతులలో నార్యు లిడిన
రగడభేదంబు లివి యగాను రమ్యచర్య
యవితనిజదాససముదాయ యాంజనేయ. ౧౮౧

—౯ ఉదాహరణలక్షణము ౯—

సీ. సప్తవిభక్తులు సంబోధనంబునఁ
గలుగు నెనిమిదివిభక్తులఁ గ్రమమునఁ
బతిపేరితోఁ గూడఁ బద్య మొక్కొక్కటి
రచియించి రగడమార్గముల జాడఁ
గళికకు నెనిమిది దళములు రాఁ జెప్పి
తత్పదార్ధమున నుత్కళికఁ జెప్పి
యదియు నేకసమాస మై యేడుదళముల
కొన విభక్త్యర్థంబు గనఁగఁ జేసి
దాని కెనగాఁగ నెనిమిదాదళము గూర్చి
పద్య మొక్కటి సార్వవిభక్తికముగ
నందుఁ దుదఁ గూర్ప నది యుదాహరణ మగును
ధీర యోయాంజనేయ సుధీవిధేయ. ౧౮౨

సీ. అన్నియు త్తళికల నటువిభక్త్యాభాస
రాఁ జేసి చెప్పిన రహిఁ బహిఁ నుఁ
గా జేని పష్ఠి న్నుత్తళిక నేనిఁ జతుర్థి
నేని రాఁజెప్పిన నెసఁగియుండుఁ
బ్రథమ వీరావళి ప్రబలద్వితీయఁ గీ
ర్తిమతి రా సుభగ తృతీయ నలర
మఱి చతుర్థికి భోగమాలిని యును బంచ
మికిఁ గళావతియు షష్ఠికిని గాంతి
మఱియు సప్తమికిఁ గమలయును సంబోధ
నమునకు జయవతియు నమరఁ గూర్ప
ఫల ముదాహరణవిభక్త్యధిదేవతల్
కరుణ నిడుదు రయ్య కపికులాఢ్య ! ౧౭౩

—: ఉదాహరణము :—

ప్రథమావిభక్తిలో:—

ఉ. శ్రీహనుమన్మహాకపివరేణ్యుఁడు పుణ్యుఁ డగణ్యసద్గుణ
వ్యూహామనోజ్ఞభూషుఁడు, సమున్నతవాలధిజాతవాతసం
దోహనివారితాసురఘనుండు ఘనుండు యశోధనుండు తే
జోహిమదీప్తి రాఘవభటాగ్రణి ప్రోచును మమ్ము సత్కృపన్. ౧

కృమభగతికళిక:—

మఱియు దశరథరాజనందనమంజుపాదసరోజభృంగము
దుంకుటసురులనియెడు మదగజఘటలఁ బొరిగొను కొదమసింగము
బలిమి గరుడనితోడ నేరెడుఁబంటికై బెనఁగిన యుదారుఁడు
చెలఁగి యక్షునిఁబట్టి చట్టలు చీరివైచిన సమరశూరుఁడు
దాసులకు ముంగొంగుఁబసిఁడివిధమున వెలసిన యార్తబంధుఁడు
వాసవాదిసమస్తనిర్జర వర్ణితామితసుగుణసింధుఁడు
ఎగిరి జలనిధిదాఁటి లంకిణి నేపుమాపిన విక్రమోగ్రుఁడు
పగడములజిగిఁ బెగడుమొగమునఁ బరఁగుచుండెడు శుభసమగ్రుఁడు.

ఉత్తరళిక:—
ఎదురు నసురులఁ గడఁ జలంబునఁ
జదియఁగొట్టి భుజాబలంబునఁ
బెఱికి మంచులగట్టు గొబ్బున
మెఱసి తఱితోఁ దెచ్చి యుబ్బునఁ
గడిమి నని దశకంఠుఁ జేసినఁ
బడినలక్ష్మణు బ్రదుకఁజేసిన
వీరవానరసార్వభౌముఁడు
ధీరకైరవపూర్ణసోముఁడు. ౩

౨ ద్వితీయావిభక్తిలో:—
ఉ. మానును రోగము ల్వెతలు మానును లేములు మాను మీకు నో
మానవులార యూరక భ్రమం గొననేటికి నన్యదేవతా
ధీనులు గాక యెవ్వఁడు నతిస్థిరభక్తి దలిర్పఁ గొల్వఁడీ
మానినుతప్రసిద్ధమతిమంతుని మాహనుమంతుని న్సదిన్. ౧

ద్విరదగతికళిక:—
మఱియు భీమాకారమకరిఁ గొట్టినవాని
మెఱసి రణమునఁ బెరిఁగి మిన్నుముట్టినవానిఁ
బేరుకలరక్కసుల పీఁచ మడఁచినవాని
వారాశి మున్మూఁడు వడిని గడచినవాని
బ్రహ్మాస్త్రబంధంబుఁ బాయఁ ద్రెంచినవాని
బ్రహ్మపట్టంబునకు భావ ముంచినవాని
నిల భాగవతులందు నెన్నఁ జాలినవాని
గలితధృతి వేలుపులగట్టుఁ బోలినవాని. ౨

ఉత్తరళిక:—
౧ భీమగతిఁ బాతాళ
౨ హోమ మొసరుచు వేళ
౩ మబ్బుదిరుగుడు తేని
౪ యుబ్బు చెదరఁగఁ బూని
౫ సంచలించుచు బొబ్బ
౬ రించఁగా నొకదెబ్బ
౭ వేసి యార్చినవాని
౮ వాసిఁ బేర్చినవాని. ౩

తృతీయావిభక్తిలో:—

చ. భవహర మాను బుట్టువును బావన మాను దరిద్రతావ్యథా
నివహము లన్నియుం దొలఁగు నెమ్మది నెవ్వనిపుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు సత్ప్రియాజిసం
భవహితదాసుచేత హనుమత్ప్రభుచేత సభీప్సితార్థముల్. ౧

తురగవల్గనకళిక:—

మఱియు సురసమాయ గెలిచి మహిమ మెఱయు యోగిచేతఁ
బెఱికి రావణునివనంబు పెంపుచెఱచు వేగిచేత
గట్టిగాఁగఁ బసిఁడిముంజిఁ గట్టుకొన్న వటునిచేతఁ
జట్టుజాతి నాతిఁజేయఁ జాలినతని భటునిచేత
రవిజుఁ దెచ్చి పంపయొద్ద రాముఁ గూర్చు ఘనునిచేతఁ
జవుటికడలి దాఁటినట్టి జవవిశాలధనునిచేత
మఱవ కెపుడు దాసజనుల మనుచు మునివిధేయుచేత
నెఱుక మెఱసి వరము లిచ్చి యెసఁగు నాంజనేయుచేత. ౨

ఉత్కళిక:—

౧ మొదలిచదువుజాగిలములు ౫ పోరిలోన గెలువఁ జాలు
౨ పొదలి సోఁకుబంటుగములు ౬ వీరుఁ డైనవాని డాలు
౩ కొలిచిరాఁగ సెలుగు నేసి ౭ నడునున్న వేల్పుచేత
౪ నిలిచి మింటు చెంచు డాసి ౮ మందరాగకల్పుచేత. ౩

చతుర్థీవిభక్తిలో:—

ఉ. చాటుమహాప్రబంధముల జాడల లక్షణవేత్త లౌననన్
సూటిగ విన్నవీనులకు సొంపుగ నేనిటు కావ్యము ల్మహా
నాటకముఖ్యకావ్యము లొనర్చినయట్టి మనీషికై మహీ
జాటకులాబ్జభాస్కరునికై హనుమత్ప్రభుకై యొనర్చెదన్. ౧

హరిగతికళిక:—

మఱియును బంగరుజందెము ముంజికమండలుదండముగలపుణ్యునకై
మెఱయఁగ సుగ్రీవాంగదు లౌనన మెలఁగెడు కపిలోకవరేణ్యునకై
తొలువేలుపుఁదపసినినొకపిడికిటఁదునియఁగఁబొడిచినబలుమల్లునకై

వెలసిన పెనురాకాసిమెకమ్ముల వేఁటాడెడు భీకరభిల్లునకై
రహిఁగలసద్గుణమహిమనుఁ బొలుపగురామాయణమహోజ్జ్వలమణికై
మహిదుహితృమనోవల్లభదాససముచితధీవరకైరవఘృణికై
బళిరాయన బలుఱాయి కరంగఁగఁ బాడినగానకళాలోలునకై
సలలితసుకృతఫలంబున కేసరిసతి గాంచిన ముద్దులబాలునకై. ౨

ఉత్కళిక:—

వేసర కిర్వదిచేతుల నలకై
లాసము నెత్తిన బలుదొరపురికై
పనిలసఖుం డాహుతిగాఁ గొని కై
కొనఁగాఁ జేసి ప్రతాపమహాకై
రవరిపు నెసఁగించుచు మాయాకై
తవబలు లగుదనుజుల మదయుతకై
టభనిభులను దనిమిన శూరునకై
శుభములు నతులకు నిడుధీరునకై. 3

పంచమీవిభక్తిలో:—

ఉ. ఏయెడనైన వైష్ణవజనేతరులన్ భజియింపఁబోక మీ
రాయతబుద్ధు లౌమనుజులార భజించినమాత్ర గొబ్బున
న్నాయనిలాత్మసూనువలనన్ రఘువంశజరామధారుణీ
నాయకకార్యకర్తవలనన్ విడఁజాలును గర్మబంధముల్. ౧

ద్విరదగతికళిక:—

మహితసూర్యకుమారమంత్రికుంజరువలన
వఱలునతజనవారవజ్రపంజరువలన
సవినయస్థితిఁ బొల్చు సత్యసంధునివలన
భవదోషపటుతిమిరపద్మబంధునివలన
విజితేంద్రియత్వమున వెలయుజయధనివలన
నజముఖ్యసురవినుతనానాగుణఖనివలన
భీమాజిపశ్చాకబిరుదోద్ధురునివలనఁ
దామసాకృతిదైత్యతతిభీకరునివలన. ౨

ఉత్తరళిక:—

౧ రాముతళ్లిఘుప్రసాద
౨ మోమితీసుకమోద
౩ గతిఁజెందగానిండు
౪ మతిడెబ్బదియురెడు
౫ వెల్వలకు నేమించి
౬ తెల్విమీఱఁగఁబంచి
౭ యొసఁగుమాన్యునివలన
౭ నెసగుధన్యునివలన.

షష్ఠీవిభక్తిలో:—

ఉ. దాంతులుగా మహాగిరులు తోరముగల్గినతోఁకచుట్టు పై
వింతవహింపఁ జేర్చి వినువీధిని నుబ్బగ గొబ్బగొబ్బనం
బంతముమీఱఁ గట్టకును బల్లముఁ దెచ్చినయట్టి యానభ
స్వంతునిపట్టికిం బ్లవగచంద్రున కెవ్వరు సాటి లావునన్. ౧

తురగవల్గనకళిక:—ఛేకానుప్రాసము.

మఱియు బెరయు రామనామమానవేనసేవకునకుఁ
దఱచుమెఱచు నక్షవృక్షదారుణోరుపావకునకుఁ
జెలువు సలుపు గలిగిమెలఁగు క్షిప్రతాప్రభంజనునకుఁ
జలము బలము నెన్నఁగన్న సాధుయూథరంజనులకు
ధీరశూరపాళిపాలి దేవతావనీజమునకు
భూరివారిజాప్తదీప్తిఁ బొల్చునిల్చు తేజమునకుఁ
గేల మేలిఫలము లలము కీశభేశభూషణునకుఁ
జాల వాల మూఁచి చాఁచు శత్రుగోత్రభీషణునకు. ౨

ఉత్తరళిక:—

౧ రాముచే మెఱుంగెసంగ
౨ భూమమై మెలంగు నుంగ
౩ రమిడి చిముడు సీతచేత
౪ మమర సమరరీతి చేతఁ
౫ గినుకఁ జెనకి చుట్టిపట్టి
౬ దనుజతనుజుఁ గొట్టినట్టి
౭ దళితలలితవనకులునకు
౮ గిళితకలితదినకరునకు.

సప్తమీవిభక్తిలో:—

శా. నందిగ్రామపురంబునన్ భరతుఁ డుండన్ ముందుగా వచ్చి యా
మందేహారికులాబ్ధిచంద్రునకు రామక్షేమవృత్తాంతముల్

విందుల్ సేసిన పుణ్యసంఘు దితిభూవిధ్వంసియందుఁ సుధీ
బృందారాధితపాదునందు నిలిచెఁ శ్రీమత్ప్రతాపోన్నతుల్.

హంసగతికళిక:*——

మఱియు నుతికెక్కు శ్రీమంతునందు
జనపక వరంబు లిడు శాంతునందు
భావసేవితరామభద్రునందు
రావణముఖాసహ్యరౌద్రునందుఁ
బ్రకటితాచారసంపన్నునందు
సకలహితసాధుప్రసన్నునందు
స్వామిహితకార్యనిర్వాహునందు
సామాదినయసముత్సాహునందు.

ఉత్కళిక:——

౧ పవనవేగంబు ౫ చారువిస్ఫూర్తి
౨ వివిధయోగంబు ౬ భూరిసత్కీర్తి
౩ ప్రచురశౌర్యంబు ౭ గలసుకృతియందు
౪ నచలధైర్యంబు ౮ వెలయుప్రతియందు.

సంబోధనవిభక్తిలో:——

ఉ. భీమమహోరులం గెలిచెఁ బెద్దఱికం బొనరింపుమంచు శ్రీ
రాముఁడు మెచ్చి యిచ్చిన విరాజితబంధురతారహార మా
భూమిజ దెచ్చి కంఠమునఁ బూన్చినఁ జెల్వువహించునాఁటి నీ
శ్రీమహితాకృతిం దలఁతుఁ జిత్తమునం బవమానవందనా.

ద్విరదగతికళి:——

మఱియు ఛాయాగ్రాహిమద మడంచినవీర
నెఱయఁ బరమధ్యాననిష్ఠాసమాచార
భావివేళాబ్రహ్మపట్టోచితాకార
గ్రావసమధృతి గల్గు గంధవాహకుమార

---

* ఈ హంసగతిని గవి తన గ్రంథములో నీయ లేదు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు— ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు.

### ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, (కోశాధ్యక్షులు).

పెద్దాడ రామస్వామిగారు, యం. ఏ.,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు, యం. ఏ., యల్. టి.

దర్భా వేంకటశివరామరావుగారు, బి. ఏ., బి. యల్.

అక్కిరాజు వేంకట్రామయ్యగారు.

కేశవరపు రామరాజుగారు.

కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిల్లారిసెట్టి రంగబ్రహ్మారావునాయుడుగారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)


సంపుటము. ౨౭ { బహుధాన్య నామసంవత్సరము. జ్యేష్ఠాషాఢమాసములు. } సంచిక ౨





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే [illegible]ర్యాలయమునఁ

ప్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0

విడిసంచిక, రు. ౧-౦-౦.

1938 జూన్, జూలై.

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

| | | |
|---|---|---|
| సంపుటము. ౨౭ | బహుధాన్యనామసంవత్సరము.<br>జ్యేష్ఠాషాఢమాసములు. | సంచిక ౨ |


## — మనవి —

బహుధాన్య సంవత్సరములో (౨౭వ సంపుటములో) నిదియప్పుడే రెండవసంచిక. చందాలను వెంట వెంటనే పంపుచుండఁ బలువురకు జాబులువ్రాసియుఁ బత్రికాముఖమునఁ గోరియుఁ బాఠకుల నారాధించుచున్నారము. అయినను వెంబడిని బహు వారు పంపుచున్నారు. పంపవలసినవారు నింకనుగలరు. కొందఱు క్రొత్తసంవత్సరమునకే పంపవలసియున్నది. కొందఱు వెనుకటి యేఁటిచందాయును బంపవలసి కనఁబడుచున్నది. దయచేసి యెల్లపాఠకులును క్రొత్తవత్సరమునకుఁ బ్రాఁతయేండ్లకును సాధ్యమైనంత శీఘ్రకాలములోఁ జందాధనమును దయచేయుదురని కోరుచున్నారము.

కార్యదర్శులు.

# తిక్కన – ఆంధ్రజయము.

— వెంకటి శ్రీనివాసమూర్తిగారు, బి. ఏ. తిరుపతి. —

'విశ్వశ్రేయః కావ్య'మను నార్యోక్తిని మనమునం దిడుకొని పూర్వకవులు కావ్యములను సృష్టించినా రనుట జగద్విదితము. అందును మాన్యాముల నీయఁగలిగిన ప్రభువుల కంకిత మీయక ప్రతిఫలనిష్టాములై భగవదర్పిత మొనర్చిన కవులయం దీసూక్తి నిర్వివాదాంశము. ప్రభువుల కంకిత మీయఁదలఁచినప్పుడు వారిచిత్తవృత్తినిబట్టి మెలంగుట కర్తవ్యము. ఒకరాజునకుఁ బురాణము లన్నఁ బ్రీతి. ఇంకొక ప్రభువునకు శృంగార మన్న మక్కువ. రాజు పండితుఁడైనచోఁ బాండిత్యప్రకర్షపై నాదరము మెండు. ఇట్లు రానురాను కవులకు స్వాతంత్ర్యము నశించి, అనుకరణమెక్కువై నీచకావ్యములు బయలుదేఱినవి. రాజాస్థానములం దున్నను, ఒకవేళఁ బ్రభువుల కంకిత మొనర్చినను, ప్రభువులును గవులును, గావ్యము కేవలము స్వీయానందమునకొఱకుఁ గాక విశ్వశ్రేయస్సునకను మాట మఱవని కాలము పురాణయుగము. మనుమసిద్ధి వద్ద మంత్రిగా నుండియు, నతఁడు పోఁగొట్టుకొనిన రాజ్యమునకుఁ బునఃపట్టాభిషిక్తుని జేసియు, తిక్కన భారతము నాతని కంకిత మీయక హరిహరనాథున కొసఁగుట యీసూక్తి ననుసరించియే. దారిద్ర్యముచే ననేకము లిడుములం గుడిచియు, బావచేఁ బ్రేరేపితుఁడయ్యును 'సిరిరా మోఁకాలొడ్డి' పోతన భాగవతమును భగవదర్పితము చేయుట యీయాదర్శమును మనం దిడుకొనుటచేతనే. కావున ననన్యసామాన్యశేముషీసంపన్ను లగునిట్టికవుల కావ్యములను విమర్శించునప్పుడు కవివలెనే విమర్శకుఁడును నిష్కాముఁడై యుండవలెను.

బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు 'ఆంధ్రజయము'లో (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంచిక 5- సంపు. 26) తిక్కనవిరాటపర్వములో నొకఘట్టమును విమర్శించుచు 'వినోదార్థము కొంచెము ముచ్చటింప నెంచితిని' అని వ్రాసిరి. తిక్కనకవిశ్వాసము నర్థము చేసికొనునప్పుడు

గాని, విమర్శించునప్పుడు గాని యేమాత్ర మజాగ్రత్తగా నున్నను దప్పు డుప్పొవలోఁ బడుట నిశ్చయము. పూర్వకవుల మహాకావ్యము లన్నియు నిట్టే యున్నవి. ఒక్క తెలుఁగుననే గాక యితరభాషలయందును నీలక్షణము వర్తించును. ఆంగ్లమున ఛాసరు, మిల్టను, డ్రైడెను మొదలగు వారికావ్యములు, గ్రీకులో ఇలియడ్, ఓడిస్సీలు నిటువంటివే. ఆంగ్లవిమర్శకుఁ డగురస్కిన్ ఈకఠినత కొకకారణముఁ జెప్పెను. (Ruskin's Kings' Treasuries) పూర్వకవులు తమకావ్యముల నభిలాషతోఁ జదువువారికే యర్థ మగునట్లును, వినోదార్థము చదువు నల్పజ్ఞులయొక వ్యర్థము గాకుండునట్లును నాతికఠినముగ వ్రాసిరనెను. అంతేగాక పూర్వకవికృతగ్రంథములను బఠించునప్పుడు మనచిత్తము వచ్చినట్లు కవులు వ్రాసిరా, లేదా యని పరీక్షింపక, వారినుండి క్రొత్తవిషయములు గ్రహించు నుద్దేశ్య ముండవలె ననియు నుడివెను.

సుబ్బయ్యశాస్త్రిగారు తిక్కన వ్రాసిన 'అల్లదనంబున నమ్రు మై కొనఁజూచు నడపుకాంతికి వింతతోడవుగాఁగ...' (విరాటప. ఆ1-245.) అనుపద్యము 'అనాయాసముగా బోధపడుట కనువగు పదములతో నడచుటలే దని'రి. దీనికిఁ గారణ మీనీసపద్యములో మూఁడు తప్ప యు పదములు తప్పఁ దక్కిన వన్నియుఁ దెలుఁగుమాట లగుటయే. తదితరము లగుచోట్ల సామాన్యముగ నర్థముగాని పదములను దిక్కన వాడియుండ వచ్చును గాని, ఈపద్యమున నర్థముకాని పద మొక్కటేనియుఁ గానరాదు. శాస్త్రిగారిసంస్కృతవ్యామోహము వారు తిక్కనపద్యముతోఁ బోల్చుట కిచ్చిన యేనుఁగువారిపద్యముచేతనే తెలియుచున్నది. (ఇంచుక ముద్దులేనగవు...) ఈపద్యమునందు వదితెలుఁగుమాటలు తప్పఁ దక్కిన వన్నియు సంస్కృతపదములే.

ఉత్తరావయోవర్ణనము నారికేళపాకమునఁ బడిన దనుటవిచార్యము. ఈపద్యము కొలఁదిశ్రద్ధతోఁ జదివిన నర్థమగుచున్నదై కదళీపాకమున నున్నది కాని నారికేళపాకమున లేదు. శాస్త్రిగారు తమవిమర్శనములోఁ బదలాలిత్యమూ లేక శబ్దాడంబరమూ పాదాదినేత్రాంత

వర్ణనమూ లేక నేత్రాదిపాదాంతవర్ణనమూ—అను విషయములే చర్చించిరి గాని, శిక్షకపద్యములోని భావగాంభీర్యమును గొలఁదిగా నైన గమనింపలేదు.

అస లిచ్చట యువతీవయోవర్ణనప్రస్తావన మొదుల కని శాస్త్రిగారికి సందేహము వచ్చినది. కావ్యమున నేవర్ణనలు లేకుండ నుండునా? అదియునుగాక, ఉత్తర కథారంగమునఁ బ్రవేశించుట కిది మొదటిసారి. అప్పు డుత్తర ముక్కు మొగ మెట్లున్నదో, యేవయస్సున నున్నదో, నృత్యవిద్య నేర్చుట కను వగునో కాదో, యనువిషయములు పైపద్యమున లేకున్నఁ బాఠకులకుఁ దెలియఁజాలవు. పైనుండి శాస్త్రిగారు విరాటుఁ డీవర్ణనను విజయునకు వినిపించినట్లుగా భావించి, అర్జునుఁడు పేడియగుటచేతను అతనికి భావిసంబంధము చే నుత్తర కోడ లగుటచేతను నీశృంగారవర్ణన మనుచితముగా లే దనిరి. ఇది పొరపాటు. ఈపద్యము కథాసందర్భమునకుండి పాఠకుల కొఱ కుద్దేశింపఁబడినది గాని విరాటునిచే విజయునకుఁ జెప్పఁబడలేదు. (జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు చునికిఁ దెలుపుచుండ నుత్తర చనుదెంచె) ఉత్తర పరోక్షమున నున్నయెడల విరాటుఁడు వర్ణించి చెప్పవలయును గాని ప్రత్యక్షముగా బృహన్నల చూచునప్పుడు విరాటుఁ డేలచెప్పవలయును ? ఇట్లు శాస్త్రిగారు పొరపాటుగా భావించుకొని, దానిని విమర్శించుట యొండమావులకొఱకు వెతకిన ట్లున్నది.

శ్రీసుబ్బయ్యశాస్త్రిగారింకొకయపోహకుఁ గూడ లో నై దానికిఁ దగినట్లుగాఁ బద్యముల నన్వయము చేసికొని దురభిప్రాయపడియున్నారు. ఈసందర్భములు మూఁడు: రాజకుమారీయౌవనవర్ణనము పునస్సంధానమందిరమును బ్రవేశింపఁబోవునపు డున్న ట్లున్న దనుట, విరాటుఁ డుత్తరపైఁ గనుపఱచిన చేష్టలు దీర్ఘవియోగనష్ట యగునాయకియెడ నాయకుని యనురాగచేష్టలవలె నున్న వనుట, బృహన్నలకుఁ గూఁతు నప్పగించుట యల్లునకుఁ బిల్లనప్పఁజెప్పినచొప్పున నున్నదనుట.

మొదటిసందేహమునకుఁ గారణ మేమాత్రమును గాన్పింపదు. యౌవనమున నుండు స్త్రీవర్ణన మెవరు చేసినను వయోవిలాసాదులనే

గదా వర్ణించునది? 'జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు మనికిఁ దెలుపుచుండు'
అని తిక్కనయే వచించినాఁడు. యౌవనావిర్భావ మగుటచే నుత్తర వివా
హయోగ్య యని తెలియుచున్నది. వివాహమును బునస్సంధానమును
నొక్కదినముననే జరుగుట యాచార మగుటచే నుత్తర పునస్సంధానయో
గ్యగా నున్నను దప్పేమియు లేదు. తరువాత నొకసంవత్సరమునకే యుత్త
రకు వివాహమై గర్భవతికూడ నయ్యెను. ఇట్లుత్తరావర్ణనము సంద
ర్భోచితముగా నుండ నీవిమర్శనమున కేమికారణమో తెలియకున్నది.
రాజకుమారి పునస్సంధానమందిరమునకుఁ బోవునపు డున్న ట్లుండుట
కేమియాధారము లున్నవి? వచ్చునది సభామందిరమునకు, పిలిపించిన
వాఁడు తండ్రి, పిలిపించు నుద్దేశ్యము విద్యాభ్యాసము. అన నుత్తరకు
వివాహమే కానప్పుడు పునస్సంధానప్రసక్తి యేమున్నది?

రెండుమూడుసందర్భములందును విమర్శన మీధోరణినే యను
సరించినది. సాధారణముగఁ దండ్రులందఱును దమపిల్లలవిషయమున
నిట్లే ప్రవర్తింతురు. కవుంగిలించుట, ముద్దుపెట్టుకొనుట, తలదు గోళ్ళతో
దువ్వుట, ముఖములో ముఖముపెట్టి చూచుట, తండ్రులు సాధారణము
గఁ జేయులాలనలు. తిక్కన యీయనురాగచేష్టలనే యెంతయపూర్వము
గా వర్ణించెనో చూడుఁడు:

చ. తిగిచి కవుంగిలించి జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె
మ్మొగము మొగంబునం గదియ మోపుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం బొరింబొరి నపూర్వవిలోకన మాచరించుఁ గ
ప్పగు మృగమౌళి నుజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్.

బృహన్నలకు విద్యాభ్యాసమునకై యుత్తర నప్పగించునప్పుడును
రాజు ప్రేమనే గనబఱచినాఁడు. 'నాకుహృదయ మలరు దీనియెడఁ గడు
నార్ద్రమై యుండు' నని స్పష్టముగాఁ జెప్పెను. క్రొత్తగఁ బిల్లలను బాఠ
శాలలోఁ జేర్చునప్పుడు జనకు లుపాధ్యాయులతోఁ దిక్కనవ్రాసినట్లు చె
ప్పుట మన మిప్పటికిని జూచుచుందుము. ఆభావములనే తిక్కన యెంత
సహజముగఁ గూర్చెనో చూడుఁడు:

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దనయిచ్చ నాడమరగినయదియై
విచ్చలవిడి నింతకుము, న్నిచ్చేడియ మెలఁగుశిక్ష యెఱుఁగదు సుమ్మా.

ఆ. బాల కేళిమీఁద భరము గ్రమంబున
విడువఁ గళలయందు వేడ్క సొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు
నెలఁత కేడుగడయు నీవ కాదె.

అంతకుముం దెన్ని సంవత్సరములు చదువు నేర్చుకొనుచుండినను, వెనుకటివారు ప్రేమాధిక్యతచేత "మనుపు శిశు వెఱుఁగఁడు, ఆటల మీఁద బుద్ధి పోకుండఁ జూడవలసిన ద"ని చెప్పుచుండు టందఱును నెఱుఁగుదురు. శాస్త్రిగా రీభావమును గుర్తింపక శిక్ష యెఱుఁగదు సుమ్మా" యన్నంతమాత్రమున "ఈచేడియ కిదివఱ కుపాధ్యాయునియొద్ద విద్య నభ్యసించుజాడయే తెలియదని నుడువుటచేత నిద్దియే విద్యాభ్యాసమునకుఁ బ్రాథమికదివస మగుచున్న"దని యూహించుట పొరపాటు. ఈ పద్యములో "విరటుని వాగ్ధోరణి యల్లునకుఁ బిల్లనప్పఁజెప్పు చొప్పు నుల్లసిల్లఁజేయుచున్నద"నుటయుఁ జాల విపరీతముగ నున్నది.

'తిగిచి కవుంగలించి' యనుపద్యసందర్భమున "ఇది యు నుం గాక విరాటమహారాజేల పేరోలగమున నీలీల బాలికపై నింతటిమక్కువను బ్రకటింప నెంచె? తనకుఁ గొమరితపైఁ గలయల్లారుముద్దును బృహన్నలకుఁ జూపనమకట్టియా" అని సందేహము వచ్చినది. కొంచెము నిదానించి యాలోచించినచో నీసందేహము వచ్చుటకు వీలులేదు. తండ్రి పిల్లలపైఁ జూపునను రాగము సజాంతఃకరణము నుండి పొంగివచ్చు ప్రేమచేఁగాని యితరులకుఁ జూపుటకుఁ గాదని ప్రతిమనుష్యుఁడును నెఱిఁగినవిషయమే. విరాటుఁడు కూఁతురిపై నంతటిమక్కువను జూపుటకు రెండుకారణము లున్నవి. మొదటిది యుత్తర రాజున కొక్కతే కూఁతురు. రెండవకారణము గ్రంథమునందే లిఖితమై యున్నది. 'అల్లనల్ల గదిసి ప్రౌఢవనిత కైవడి ముద్దియ ముద్దుపుట్టఁ దనకు మ్రొక్కుటయును' చిన్నపిల్లలు పెద్దమనుష్యులమాదిరి మాటలాడినప్పుడు గాని ప్రవర్తించినప్పుడుగాని తలిదండ్రు లధికానురాగముతో నెత్తికొని లాలించుట సహజము.

'ప్రౌఢవనితకైవడి మ్రొక్కుటయు' ననుచోట శాస్త్రిగారికి మఱి యొకసందేహము వచ్చినది. నమస్కారాచరణములో భక్తివినయములు వెల్లడింపవలయును గాని, యీప్రౌఢిమ యేమిటి కని ప్రశ్న. ప్రశ్నకు సమాధానము ప్రశ్ననుండియే గ్రహింపవచ్చును. ఆభక్తివినయములు వెల్లడించుటకే ప్రౌఢిమ కావలెను. అన్నిపనులలోఁ బ్రౌఢిమ యెట్లవసరమో, నమస్కారాచరణములోఁ గూడ నట్లే యవసరము. కొందఱు పెద్దవారు గూడ సరిగా నమస్కార మొనర్పుట దెలియక సంకోచించుట మనము చూచుచుందుము. చిన్నపిల్లలు నమస్కారములోని యర్థము దెలియకయే చేతులను జోడించుచుందురు. యువకులు బిరుసుగ నడుము వంచకుండ నమస్కార మిడుదురు. వీరిలో భక్తివినయములు తక్కువ. వృద్ధులీవిషయమందుఁ బ్రౌఢులు గనుక వంగివంగి నమస్కార మొనర్చెదరు. రాజాస్థానమునుండి, మంత్రిపుంగవుఁ డైన తిక్కన యీభేదముల నెల్ల గ్రహించియుండును. అందువలన నుత్తర బాలికయైనను ప్రౌఢస్త్రీవలె నమస్కరించి నవ్వుకు ముద్దుపుట్టినది.

ఇంతలో శాస్త్రిగారి కొకవింత గాన్పించినది. "ఇంత ప్రసంగము సాగినను సవ్యసాచికి నుత్తర విరటుని చెల్లెలో, మఱఁదలో, కూఁతురో, కోడలో, మనుమరాలో తెలియునవకాశము చిక్కదాయెనంట! రాజు సభామధ్యమున మఱఁదలిని గోడలినిగూడ 'తిగిచి కవుంగలించు...' కొనునుగా! బృహన్నల వచ్చినతరువాత 'తనకూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె' (1-243) నని గ్రంథమునం దున్నది. రాజు కూఁతురిని దీసికొని రమ్మని యాజ్ఞ యిచ్చినప్పు డెదుటనున్న బృహన్నలకుఁ దెలియకుండ నుండఁగలదా? రాజు రహస్యముగా మాటాడె ననుకొనుట కేమియుఁ గారణము లేదు. రాజకుమారి వచ్చుటకు ముందు ప్రవేశమును దెలియఁజేయు రాజమర్యాదవలన నైనఁ దెలిసియుండదా? లేకున్న నుత్తర యభివాదన మొనర్చునప్పుడైనను, విరాటుఁడు లాలించునప్పుడైనను సవ్యసాచి గ్రహింపఁడా? అర్జునుఁ డన్నివిషయములు జరిగినను దెలిసికొనక, రాజు 'ఈబాలిక నాకూఁతురు' అని చెప్పినఁగాని తెలియనంత మందబుద్ధియా?

శ్రీ శాస్త్రిగారీ క్రిందివచనములోఁ బ్రతిపదవిమర్శనము గావించి యున్నారు.

'ఇవ్విధంబున గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నలదెసం గనుంగొని, సాదరదరస్మితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాటకకళకుం దగు పాత్రంబగునే యని యడిగి...' (1 248) ఇందు రాజునకు 'దరస్మిత' ముదయించుట వెకిలిచేఁతయఁట! దరస్మిత మనిన ముప్పదిరెండుపండ్లును బైటఁబడునట్లు నవ్వుట యనుకొనిరి కాఁబోలు! మహాపురుషులకు మందహాస మొకలక్షణము కదా. 'ముగువ' పదము సుస్మితముగా లేదఁట. 'పాత్ర' పదము శ్రోత్రియమూర్ఖమఁట! 'ఇమ్ముగువ నీకు నాటకకళకుం దగు పాత్రంబగునే' యని రాజడుగుట మోటుగా నున్నదఁట! ఇంతకంటె నాజూకుగా నుండు వాక్యములను శాస్త్రిగారు వ్రాసినారు చూడుఁడు: 'ఈ నా బిడ్డ నీకు శిష్యయగుట కర్హయా' 'ఈ బాలిక నీయొద్ద విద్యార్థినిగాఁ జేరఁదగునా?' తిక్కనవాక్యములోని మోటుఁదనమును, శాస్త్రిగారివాక్యములలోని సౌకుమార్యమును బదలాలిత్యమును బాఠకులే గ్రహించి యానందింతురుగాక!

శాస్త్రిగారీపద్యములో నొకనూత్నవిషయమును వెల్లడించిరి.

ఉ. ఆఁడుఁదనంబు నిక్కమునఁ గారసి చూచిన లేదు పుంస్త్వముం
బోఁడిమిదప్పి యున్నది నపుంసకజన్మ మవశ్యభోగ్య మై
వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మభావ్య మె
వ్వాఁడును నేర్చునే తొలఁగవైవఁగ నోర్వక పోవవచ్చునే.

'విజయుఁ డిట్లు దనశాపరూపముల వర్ణించుకొనునా?' అని శాస్త్రిగారి ప్రశ్న. ఇట్లు శాపరూపముల వర్ణించుకొనుట కేమి యవసరము గలిగెనో, యీపద్యము వెనుకనున్న పద్యమును జదివిన మొదల బోధపడఁగలదు. విరాటుఁడు బృహన్నలవేషము తదాకారవిశేషములకు భిన్నముగా నున్నందున 'విభ్రమశ్రీయును బెంపునుం గలుగఁజేసి విధాతృఁడు పేడిఁజేసెనే' అని చింతించి, తద్భావకారణమును దెలియనేరక బృహన్నల నిట్లు ప్రశ్నించును.

క. ఏము నిను మత్స్యరాజ్య, శ్రీమహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం
గా మామనోరథమునకు, నీమాట విరుద్ధ మయ్యె నిది యెట్లొక్కో.

రా జిట్లడుగుటచే బృహన్నల నిజశాపరూపములను 'ఆఁడుఁదనం బు నిక్కమున కారసిచూచిన లేదు...' అని చెప్పికొనవలసివచ్చినది. ఈపద్యమువలన బృహన్నల 'శుద్ధడబిద్ధుఁడు'గఁ బొడకట్టుచున్నాఁ డని శాస్త్రిగా రాక్షేపించినారు. కాని విరాటునికి మాత్ర మట్లు గనుపడ లేదు. 'ఎవ్వఁడే నొక్కజగత్ప్రాజ్యుండు గ్రీడార్థ మి ట్లొనరం దాల్చినరూపు గావలయు' ననుకొనినాఁడు.

వ్యాసభారతమున విరాటుఁడు బృహన్నలమాటలను నమ్మక మంత్రులచేతను, నెరజాణలగు స్త్రీలచేతను బరీక్షింపఁజేసి తరువాత నంతఃపురములోనికి వదిలెను. శాస్త్రిగారు తిక్కనరచనకన్న 'పరిశీలింప నిదియే సమంజస మగురచన' యని వ్రాసిరి. కాని వ్యాసుని రచనపైఁ దిక్కనకూర్పును బరిశీలింపుఁడు. వ్యాసభారతములో విరాటుఁడు బృహన్నలమాటలను నమ్మకపోవుటకుఁ గారణ మెద్దియో తెలియదు. బుద్ధిమంతుఁ డగు రాజు రూపసంభాషణాదులచే నిజతత్త్వమును గ్రహింపవలెను గని మంత్రులచేతను స్త్రీలచేతను బరీక్షింపఁజేయుట భావ్యముకాదు. క్రొత్తవారిని బరీక్షించుట యన వా రబద్ధము చెప్పిరని యనుమానించుటయే కదా! అట్టియవమానమునకు లోనై యూరకుండునంతటిమానధనుఁ డచ్చోటఁ గొలువున కుండునా? ఈలోటును గ్రహించి తిక్కన మార్పొనర్చెను. తిక్కన భారతములోని విరాటుఁడు బృహన్నలశీలమును గుర్తింపలేనంత మందబుద్ధి కాఁడు. బృహన్నల సభలోనికి వచ్చుచున్నప్పుడే యాతని గుణశీలములను గ్రహించెను. చూడుఁడు:

మ. వనితావేషము గల్గియున్న యది చెల్వం బొడుచందంబు రా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వముం రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁడే నొకజగత్ప్రాజ్యుండు గ్రీడార్థ మి
ట్లొనరం దాల్చిన రూపు గావలయు నీ రూపింపుఁడా యట్లగుఁ

ఇంతేగాక తనకూఁతురిని బృహన్నల కప్పగించునప్పుడు రాజు ముం దాలోచనలేక పనిచేయలేదు. 'గౌరవమొంద నైపుణంబున నుచితంబు మై నరసి పొచ్చెములేమి తదీయసేవ గైకొనుటకు నిశ్చయించి' తరువాత నుత్తరను బిలిపించెను. తిక్కన భారతములోని విరాటుఁ డిట్లుఁ గౌరవయుక్తముగను లౌకికముగను బ్రవర్తింప, వ్యాసభారతములోని విరాటుఁడు బృహన్నల నపుంసకత్వము నాఁడువారిచేఁ బరీక్ష చేయించి శుద్ధ వైదికముగాఁ బ్రవర్తించె ననుటకు సందేహము లేదు.

వ్యాసభారతములో లేకున్నను దిక్కన యీఘట్టమునఁ గొన్ని పద్యముల నెక్కువగా వ్రాసెనని యొకయాక్షేపణ. కళాదృష్టిలోఁ దిక్కన వ్యాసభారతములోఁ గొన్నిభాగముల హెచ్చించియుఁ గొన్నిటిఁ దగ్గించియు వ్రాసినవిషయ మందఱును జర్చించినదే. చర్వితచర్వణముగ మరల నేను వ్రాయవలసినది లేదు.

మొత్తముమీఁద శాస్త్రిగారి విమర్శనము నిష్పాక్షికదృష్టితో వ్రాసినట్లు లేదు. పునఃప్రత్యుత్తర మీయలేని పూర్వకవులకావ్యముల విమర్శించునప్పుడు సహృదయము లేకున్న గుణదోషముల నారయఁజాలరని మనవిఁ జేయుచున్నాను.

---

# కాల్పట్టణము.

— కొత్తపల్లి సూర్యరావు. —

ఏదోసందేహము కలిగినపుడెల్లఁ బెద్దల నడుగుచుందును వారు బదు లిడకున్న మరల జ్ఞప్తికిఁ దెచ్చుచుందును. కాల్పట్టణమేది? వారిధితటినున్నను లేకున్నను బలువురు పలువిధముల బహుపట్టణములను బలుకుచున్నారు. ఎవ్వరికిని నిశ్చయముగాఁ దెలియవచ్చుటలేదు. శ్రీనాథునకు బమ్మెరపోతనకుఁ గలబాంధవ్యమును వారి సమకాలికత్వమును దెల్పఁజాలకున్నారు. ఏమో, అనితోఁచుచున్నది, కావచ్చు, నని సందేహ

వాహనుఁడు గుణాఢ్యునొద్దకు వెళ్లి యామహాకవి యాహుతిసేయఁగా శేషించిన యొకలక్షగ్రంథమును మాత్ర మాతనిని బ్రార్థించి పుచ్చుకొనెను. అదియే నరవాహనదత్తజననము.

తరువాత నారాజు గుణాఢ్యశిష్యులచే నా"బృహత్కథ" కర్థమును జెప్పించుకొనెను. గుణాఢ్యుఁడును యోగబలముచే స్వశరీరమును వీడెను. అప్పటినుండియు నీనరవాహనదత్తచరిత్రాత్మక మైన యీబృహత్కథ నరాతలమునం దెల్లెడలను బ్రఖ్యాతి వహించియుండెను.

ఈగ్రంథ మేశతాబ్దములోనిదో నొక్కి వక్కాణించుటకుఁ దగిన యాధారము లేవియును లేవు. కాని దండి తనకావ్యాదర్శమందు బృహత్కథను దాను వినియున్నట్లు వ్రాసియున్నాఁడు, మఱియు భట్టబాణుఁడు తన హర్షచరిత్రమం దీగ్రంథమును బేర్కొని యున్నాఁడు. దండి బృహత్కథను బేర్కొనె నన్నవిషయము నాలోచింపఁగా గుణాఢ్యుఁ డైదవ శతాబ్దమువాఁడు గాని యంతకుఁ దొల్లిఁటివాఁడు గాని కావలయు నని తెల్లమగుచున్నది. భాసవిరచితము లగుస్వప్నవాసవదత్త ప్రతిజ్ఞాయౌగంధరాయణనాటకములలోని కథలకు బృహత్కథలోని కథలు మూలభూతములై యుండనోపు నని కొందఱు విజ్ఞు లూహించుచున్నారు. అదియే సమీచీన మైనయెడల గుణాఢ్యుఁడు 3 వ శ. కంటె నూతనుఁడనుట యనుచితము.

పైశాచము వింధ్యపర్వతప్రాంతములో వ్యవహరింపఁబడు చుండినట్లు కథాసరిత్సాగరములోఁ గలదు. రాజశేఖరుఁడు తనకావ్యమీమాంసయందుఁ గూడ నిట్లే వ్రాసి యున్నాఁడు. ఇదియే సత్య మైనచో బృహత్కథ వింధ్యప్రాంతమున వ్రాయఁబడినది యనుట నిర్వివాదము. కాని కొందఱు పాశ్చాత్యపండితులు పిశాచము హిమవత్ప్రాంతములయందు వాడఁబడుచున్న దనియు, నాభాషను వింధ్యప్రాంతవర్తి యగు గుణాఢ్యుఁడు వర్తకులమూలమున నభ్యసించి బృహత్కథను వ్రాసె నని యుఁ జెప్పుచున్నారు, కాని, యది యంత ప్రత్యయముగాఁ దోఁచుటలేదు.

ఎట్లైన నేమి? గుణాఢ్యుఁడు 3 వ శ. కంటెఁ బ్రాచీనుఁడై యుండు నని చెప్పి తీరవలయును. ఇంతకును గుణాఢ్యుని పైశాచబృహత్కథ కాలగర్భమం దడఁగియున్నది.

ఇట్టి యీబృహత్కథ నాధారముగాఁ జేసికొని సోమదేవుఁడు కథాసరిత్సాగరమును క్షేమేంద్రుఁడు బృహత్కథామంజరిని బుద్ధస్వామి శ్లోకసంగ్రహమును వ్రాసియున్నారు. సోమదేవక్షేమేంద్రు లిద్దరుఁ గాశ్మీరదేశీయులు. బుద్ధస్వామి నేపాళదేశీయుఁడు- పై మూఁడుగ్రంథములకును బృహత్కథయే మూల మని స్పష్టముగా వ్రాసిరి. కథాసరిత్సాగర, బృహత్కథామంజరులకు విశేషభేద మేమియు లేదు గాని శ్లోకసంగ్రహకథాసరిత్సాగరములకు మాత్రము గాథలలో విశేషవ్యత్యాస మున్నది. శ్లోకసంగ్రహావిముక్తము లైనయనేకకథలు కథాసరిత్సాగరములోఁ గన్పట్టుచున్నవి.

కాని పాశ్చాత్యులు శ్లోకసంగ్రహమే బృహత్కథకు సరి యైన యనువాదగ్రంథ మనియుఁ బ్రథమమున బృహత్కథ సంస్కృతభాషలోనే యుల్లేఖింపఁబడిన దనియుఁ బిమ్మట మఱికొన్నికథలు చేర్చి దానిని పిశాచములోనికిఁ బరివర్తన చేసి రనియు, నీసంస్కృతగ్రంథమునుండియే సోమదేవక్షేమేంద్రులు గ్రంథములు వ్రాసి రనియుఁ జెప్పుచుండిరి. కాని సంస్కృతబృహత్కథ పైశాచములోని కెప్పుడు పరివర్తన చేయఁబడినదో తెలిసికొనుట కేమియు నాధారములు లేవు.

మఱియు నాంగ్లేయులు బృహత్కథ గద్యరూపముగా వ్రాయఁబడియున్నట్లు వ్రాసియున్నారు. కొన్నికొన్ని ప్రాకృతవ్యాకృతులయందుఁ గూడ గద్యరూపముగానే యుదాహరింపఁబడినది. సోమదేవక్షేమేంద్రులు మాత్ర మేలొకో? పద్యరూపముగా నున్నట్లే వ్రాసియున్నారు. దాని కేమి! బుద్ధస్వామి శ్లోకసంగ్రహము కథాసరిత్సాగర బృహత్కథామంజరులకంటెఁ జక్కనిశైలితో సముచితవర్ణనలతో వ్రాయఁబడినది. ఇందు సుమారు 4500 శ్లో. కలవు. క్షేమేంద్రుని బృహత్కథామంజరి మాత్రము

కావ్యశైలిని వర్ణనాపూరితమై యున్నది. ఇందు సుమారు 7500 శ్లోకములు కలవు.

కథాసరిత్సాగరము.

దీనియందు 22000 శ్లో. కలవు. మహాభారతమునందుఁ బర్వవిభాగము వలెనే దీనియందుఁ బదునెనిమిదిలంబకములు కలవు. 124 తరంగముల క్రిందఁ గూడ విభజించియున్నాఁడు. ఈతరంగవిభాగము సోమదేవకల్పితమే యని తెలియవచ్చుచున్నది. క్షేమేంద్రుని బృహత్కథామంజరివలెఁ గాక నీగ్రంథమునందు సముచితవర్ణనములు కలవు. శ్లోకములన్నియు సులభార్థబోధకములు గా నున్నవి. సోమదేవుని తరువాత నెవఁడెన్ని నాటకములు గాని కావ్యములు గాని వ్రాసినను వానికిఁ గథాసరిత్సాగరకథలే మాతృక లని చెప్పక తప్పదు. బేతాళపంచవింశతి, సింహాసనద్వాత్రింశిక, శుకసప్తతి మున్నగు గ్రంథములలోని కథలకుఁ బూర్తిగా నీకథలే మూలము. కాళిదాసుని విక్రమోర్వశీయమునకు, మాళవికాగ్నిమిత్రనాటకమునకును, రత్నావళీ, ప్రియదర్శికాది దృశ్యకావ్యములకును గథాసరిత్సాగరకథలే యాధారములు. భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్త, అవిమారకము మున్నగునాటకములలోని కథాకల్పనలు దేనిలోనివి? బాణుని హర్షచరిత్రకథాకల్పన దేనిలోఁ బుట్టినది? పెక్కేల! సంస్కృతాంధ్రభాషాప్రపంచమునఁ గలసమస్తదృశ్యశ్రవ్యకావ్యములకు నిదియే జన్మభూమి. మనము హాస్యముగా నప్పుడప్పుడు చెప్పుకొను పిట్టకథల కిదియే మార్గదర్శి.

ఆంధ్రీకరణము.

ఇట్టి సమస్తకథాలవాల మగుసోమదేవుని కథాసరిత్సాగరముఁ గొంతకాలముక్రిందట కీ. శే. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులుగారు వచనరూపముగా నాంధ్రీకరించిరి. వేంకటరాయశాస్త్రులుగా రనేకాంధ్రప్రబంధములకు జక్కనివ్యాఖ్యలు వ్రాసి కొన్ని కొన్ని మహాగ్రంథములు రచించి యాంధ్రభారతీమతల్లి కగణ్య మగు సేవచేసి చనిన పండితకవులు. ఆమహామహులఁ డిట్టియపారసాగరమునకు నావ వేసి తీర

ష్టలకుఁ గొంతదారి నేర్పాటు చేసియుండెను. లేనిచో నీకథాసరిత్సాగర పారముఁ గనుఁగొనుట యేరితరము! శాస్త్రులుగారు పండితకవులు కనుక గ్రాంథికభాషలో నీగ్రంథము సంపూర్ణముగాఁ దెనిఁగించిరి. అపార మగు నిట్టియుద్గ్రంథము నాంధ్రముఁజేసిన బ్రహ్మశ్రీ వేంకటరాయశాస్త్రులుగారి కాంధ్రలోక మంతయుఁ గృతజ్ఞతాపూర్వక ధన్యవాదము లర్పించుచున్నది. అనువాదముల యావశ్యకము, నాంధ్రీకరణపద్ధతి నాకుఁ దోఁచినరీతి వ్రాసినపిమ్మటఁ బ్రస్తుతగ్రంథవిమర్శమునకుఁ బ్రారంభింతును.

అనువాదముల యవసరము.

ఏభాషలోనైనను సద్విషయములు సదర్థములు నున్న యెడల నవి దేశీయభాషలోని కనువదించుకొనుట యత్యావశ్యకము. అనువాదములవలన విజ్ఞాన మెక్కుడు సంపాదింపవచ్చును. కేవలాంధ్రములోనే గాక సంస్కృతములోను, ఆంగ్లములోను, హిందీలోను, ఏతదితరభాషలలోను విజ్ఞానదాయకము లయినగ్రంథములు లేకపో లేదు. ప్రతిభాషలోను మంచియుఁ జెడ్డయుఁ గూడ నుండును. భాషలో ననేల! విశ్వమానవప్రకృతులు పరికించుచుండిరి గాదా? గుణదోషములు రెండు నొక్క ప్రదేశముననే యుండును. మనయాంధ్రభాషయందు మాత్ర మశ్లీలార్థబోధకములు, ననుచితార్థప్రతిపాదకములు నగుగ్రంథము లెన్ని లేవు. నే నిట్లంటి నని కోప మూనకుఁడు. ఇతరభాషలలో మాత్రము విజ్ఞానము లేదా? కవులు లేరా? గ్రంథములు లేవా? కనుక సదనువాదముల వలన భాషకు రవంతయు నపచారము కలుగనేర దని నొక్కిచెప్పఁగలను. ఇతరభాషాసంపర్కము లేక యేభాషయు వృద్ధినొందదు. మనయాంధ్రభాష సంస్కృతసంపర్కము లేక యెన్నినాళ్ళు నిలువఁగలదు. సంస్కృతము వలననే యాంధ్రమునకు వృద్ధి, గౌరవము, రామణీయత తటస్థించినవి. ఆంగ్లేయులు సంస్కృతములోనుండి వేదములు, పురాణములు, మతగ్రంథములు నెన్ని యనువదించుకొనలేదు! ఏభాష యైనను నితరభాషాసహాయము లేక పెంపొందనేరదు. ఆంధ్రభాషలోని ముప్పాతిక మూఁడువంతులు గ్రంథములు సంస్కృతానువాదితములే గదా? ఈరామాయణము,

భారతము భాగవతము దేనిలోనివి ! సంస్కృతములో నుండు నన్నియలం కారగ్రంథములు, సాహిత్యగ్రంథములు, మతగ్రంథములును, మఱియొక భాషలో నున్నవా ? ఆంధ్రభాషలోనికి సంస్కృతాదీతరభాషలలోనుండి కొన్నికొన్ని మహాగ్రంథము లింకను ననువదింపఁబడవలసి యున్నవి. కథాసరిత్సాగరమున కాంధ్రపరివర్తనమే లేనియెడల దానిలోని వింతపోకడలు, చమత్కారకథలు నాంధ్రలోకమున కెట్లు తెలియును ? కనుక నితర భాషలలోనుండు సమస్తసద్విషయములను మనదేశీయభాషలోని కనువదించుకొనవలయును.

## ఆంధ్రీకరణపద్ధతి.

మూలములోనుండురీతి నేపదమున కాపదము, తూనికరాళ్ళవలెఁ బడవేసినచో నది యాంధ్రీకరణ మనిపించుకొనదు. ప్రతిపదార్థము (టీక) వ్రాసిన ట్లగును. ఇట్లే కద్యములు వ్రాసినచో నాంధ్రభాషకు మితి లేని హాని కలుగఁజేసినవార మగుదుము. నన్నయాదులు భారతము నాంధ్రీకరించునప్పుడు నిర్భయముగాఁ గొంతఁ బెంచియుఁ గొంతఁ ద్రుంచియు స్వతంత్రకావ్యముగాఁ జేసిరి కాని యనువాదగ్రంథముగా మాత్రము చేయరైరి. అదియే నన్నయాదికవిత్రయాంధ్రీకృత మగుమహాభారతమునకుండుమహాగౌరవము. మఱియును వ్యాసభారతములోనుండుకొన్ని కొన్ని చిన్నికథలను భగవద్గీతను గూడఁదెనిఁగింపరైరి. భగవద్గీత వేదాంతసారసంయుతముగుఘట్టము. దాని నాంధ్రీకరింపఁజూచినచో నిరర్గళకవితాశైలికి భంగము కలుగునేమో ? యని తలఁచి యాంధ్రీకరింపరైరి. వేదాంతపారిభాషికపదభూయిష్ఠ మగు నాభగవద్గీతఁ దెనిఁగించినచో ద్రాక్షాసదృశ మగు కవితాప్రవాహమునకు నడ్డుతగులక మానదు. కనుక మాతృకయందలి ముఖ్యాభిప్రాయమును దీసికొని యాదిత్యమును బోషించుచు నాంధ్రీకరించిన యాంధ్రీకరణమే యాదరణీయము.

## ఆంధ్రకథాసరిత్సాగరము.

వెనుకఁ జెప్పఁబడిన వేదమువారివచనకథాసరిత్సాగరము తరువాత మఱియు నామహాసాగరమున కేతా మెత్తినవారు బ్ర. శ్రీ. ఓలేటి

వేంకటరామశాస్త్రిగారు. వీరు వేదమువారివలె వచనరూపముగా నాంధ్రీకరింపక పురాణశైలిని గద్యపద్యరూపముగాఁ బెనఁగించిరి.

గద్య, పద్య, రచనలు.

కేవల గద్యరచన సామాన్యపరిజ్ఞానము కలవారు చదువుకొని కథలకై యానందించుట కుపయోగించును. కేవలపద్యరచనయే యైన చోఁ గథ సరిగా నడువక పద్యముల కొఱకుఁ బ్రయత్నించవలసి వచ్చును. అట్లు గాక యుభయకవిత్వము (గద్యపద్యకవిత్వము) భారతరామాయణాదులవలెఁ బురాణమును జెప్పుకొనుట కుపయుక్త మగును. అని తలఁచియుఁ బండితకవుల కది యుక్తముగా నుండు ననియుఁ గాఁబోలు! శాశ్వతముగా నుండునట్టి యీకథాసరిత్సాగరము నాంధ్రీకరించిరి.

ఈకథాసరిత్సాగరము వేంకటరామకృష్ణకవులలోఁ బ్రథము లగు వేంకటరామశాస్త్రిగా రొక్కరే యాంధ్రీకరించినను బేరుమాత్రము జంటకవులు (వేంకటరామకృష్ణకవులు) అనియే పెట్టిరి. వీరిలో రెండవవారగు ద్వివేది రామకృష్ణశాస్త్రిగారు తెనుఁగుతల్లి కమూల్యసేవఁ జేసి మిక్కిలి తరుణవయస్సునందే పరమపదించుటవలన వేంకటరామశాస్త్రిగారు శాశ్వతయశస్సంపాదనమున కీగ్రంథము నాంధ్రీకరించుచుఁ దమమేనమఱఁదియుఁ దోడికవియును నగురామకృష్ణశాస్త్రులుగారియం దుండు నిర్వ్యాజప్రేమచే "వేంకటరామకృష్ణు" లనియే యాగ్రంథమునకుఁ బేరు పెట్టిరి. ఇదియునుఁ గాక జంటకవులుగా నున్నపు డెవ్వరు రచించినను నిర్వురపేరు పెట్టుటయే యుచితము.

ఈగ్రంథమును నొక్కొక్కలంబకమును నొక్కొక్కసంపుటముక్రింద ముద్రింపించుచున్నారు. నేఁటికి ౬ భాగములుమాత్రమే ముద్రితములైనవి.

కృతికి శ్రీ సూర్యరాయ మహీవల్లభప్రియసూనులును, రావువంశవిస్తారకులును, గంగాధరరామరాయాభిధానులును, నగు శ్రీ శ్రీ పీఠికాపుర యువరాజా బహద్దరుగారు నాయకులు.

వీరికవిత్వము చదువునపుడు కవిత్రయమే గాక నడుమనడుమ శ్రీనాథుఁడు పోతన్న మున్నగు మహాకవిసార్వభౌములు స్మృతికివచ్చుచుందురు.

క. మెలఁగవు మేఁతల కైనను
మలగవు జలములకు నైన మనుజులఁ గనియున్
గలఁగవు చను వగుదనుకను
దలఁగవు తన్మునివరేణ్యు దరినుండి నృపా !

పదలాలిత్యముచేతను, భావసౌష్ఠవముచేతను నీదిగువపద్య మేప్రాచీన మహాకవిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నదో తద్జ్ఞు లూహింపుఁడు.

సీ. నిండుచందురు పొందు నిందసేయఁగఁజాలు
చొక్కపు నెమ్మోము సోయగంబు
మెఱుఁగుటద్దముల నక్కఱకుఁ గైకొనఁబోని
నిద్దంపుఁ జెక్కుల నెఱతనంబు
మరుని విండులకు వంకరల నెన్నఁగఁ జూచు
కనుబొమ దోయి చక్కందనంబు
కటికిచీఁకటి యొప్పు నటమటమొనరించు
కుదిరికగల గొప్ప కొప్పు బెడఁగు
మేల్మిబంగారు పసమించు మేనిచెలువు
ముదురు పవడంబు దొరయు నెమ్మోముసొబగు
కలదు లేదనఁ దగు లేఁతకౌను సొగసు
గలిగి చెలువొందు చున్నయక్కన్నెఁ జూచి—౧ లం. ౭౮. ౫ వ.

ప్రథమలంబకమున నెలుకసెట్టి వృత్తాంతముం దీక్రిందిపద్యమును బఠించితిరా !

గీ. అట్టియెడ నీవు చేతిలోఁ బెట్టినట్టి
సొమ్ము కడతేర్చి వెండియుఁ దెమ్మనంగ
వచ్చినాఁడవు పోపొమ్ము చచ్చినాఁడ !
దాఁచఁ బెట్టితె ? యిచట నీ తాతమూట.

మూలమునలేని దూషణ సందర్భోచిత మగునీపద్యోత్తరార్థ మీకథకెంతయో రమణీయత నాపాదించిన దని చెప్పవచ్చును.

క. ఏకర్తము నెఱుఁగను మొ
  త్త్రో కావుం డనుచు వేఁడుచున్న నతని యా
  వాకు లపు డెవ్వరికిఁ జెవి
  సోఁకవ యాతఁడు వినష్టశోభనుఁ డగుటన్. — ౨ లం. ౩౧౩ ప.

గీ. ఎండ తొందఱకో కొమ్ముటేనుఁగులను
  బోలుకాముకులను మోసపుచ్చి మిపులఁ
  గఠినవృత్తి మెలంగునీగడుసుముండ
  కద్దిరా! మంచిపని చేసె నాతఁ డెవఁడొ!!

"ఏకర్తము నెఱుఁగను మొత్త్రో" "గడుసుముండ" యనునీస్వాభావికసూక్తిద్వయముచే నీరెండుపద్యములును నతిచమత్కారముఁ గలిగించుచున్నవి.

కేవలము మూలానుసారముగా తూ, చా, తప్పకుండఁగాఁ దెనిఁగింపవలయు ననియే వేంకటరామశాస్త్రిగారి ముఖ్యాభిప్రాయ మైనట్లు దెలియుచున్నయది. సాధారణముగా వీరు తెనిఁగించినంత గ్రంథములో మూలము నెక్కడను విడువలేదు. కాని యౌచిత్యపోషణమున కక్కడక్కడ సంభాషణములును జమత్కారజననమునకు నవ్యభావములు మాత్రము కొన్నికొన్ని మార్చిరి. వీరు కృత్యాది నెట్లు ప్రతిజ్ఞ చేసికొనిరో చూచితిరా!

క. అంచితమూలగ్రంథ మొ
  కించుకయును వీడఁబోక నెడనెడ నెదియేన్
  బెంచుచు నౌచిత్యముఁ బో
  షించుచుఁ దెనిఁగింపసాహసించితి దీనిన్.

వీరిప్రతిజ్ఞ యీక్రిందిపద్యములలోఁ దెలియఁగలదు.

శ్లో. జనమేజయపుత్రోఽభూత్ పౌత్రో రాజ్ఞః పరీక్షితః
  అభిమన్యుప్రపౌత్రస్య యస్యాదిపురుషోఽర్జునః
  త్రిపురారిభుజస్తంభదృష్టదోర్దండవిక్రమః — మూలము.

సీ. హరభుజాస్తంభనోద్ధురపరాక్రమశాలి
  యర్జునుఁ డెవ్వానియాదిపురుషుఁ

డభిమన్యుఁ డేవానియనుఁగుముత్తాత యు
ఛేద్యపద్మవ్యూహభేదకుండు
మహితగాథాసక్తమతి పరీక్షి న్మహీ
తలనాథుఁ డెవనిపితామహుండు
జనమేజయుఁడు మహాసర్పయాగక్రియా
పష్టంభచరితుఁ డేవానితండ్రి
గీ. యతఁడు విఖ్యాతధీరపరాక్రమాయ
కలశవారాశిపూర్ణిమాకమలవైరి
నిఖిలలోకజనస్తవనీయగుణుఁడు
పొగడఁదగఁడె శతానీకభూవిభుండు.

మూఁడవలంబకమున "వైశ్యకన్యామానప్రతులకథ" మూలము లో 25 శ్లోకములలో నున్నది. దాని నీయాంధ్రీకర్త 50 గద్యపద్యములలో వ్రాసెను.

సంభాషణాదిరీతినిఁ గూర్చి మాత్రము కొంత వ్రాయక తప్పదు.

కోమటి యామానవ్రతునియొద్దకు వెళ్ళి "నాకూఁతురు మీకు భిక్షపెట్టుచుండఁగా కటకటా! కష్టమొందవె నని యొంటు" కని రని యడుగును. యతియును "ఆమెసుందరవతియైనను దుర్లక్షణములు కలదిగాఁ గన్పడుచున్నది. ఆమె కెప్పుడు వివాహముచేయుదువో యప్పుడే నీవు సపుత్త్రదారముగా నశింతువు. కావున నాపిల్ల నొకమందసములో నుంచి దానిపై నొకగండజ్యోతి నెలకొల్పి గోదావరిలో వదలివేయుము." అని చెప్పఁగా నాకోమటి వెఱ్ఱివాఁడై యట్లేచేయును.
అని సంస్కృతములోఁ గలదు. ఈక్రిందిశ్లోకములు చూడుఁడు.

శ్లో. దుర్లక్షణేయం కన్యా తే వివాహోఽస్యా యదా భవేత్
తదా ససుతదారస్య క్షయః స్యాత్తవ నిశ్చితమ్
తదేతాం వీక్ష్య దుఃఖం మే జాతం భక్తోఽసి మే భవాన్
తేనైవ ముక్తావా నస్మి త్యక్త్వా మౌనం భవత్కృతే
తదేషా కన్యకా నక్తం మంజూషాయాం నివేశితా
ఉపరిన్యస్తదీపాయాం గఙ్గాయాం క్షిప్యతాం త్వయా.

ఈసంస్కృతమూలమున కాంధ్రీకరణములోని మార్పు నవలోకింపఁదగినది.

గీ. అనిన విని యావణిగ్వరుం డధికభయమున
మన్వితమనస్కుఁ డయి మహాత్మా! మదీయ
కష్టము తొలంగ నేదేని గతి యొకండు
తెలిపి మీరె కటాక్షింప వలయునన్ను.

క. తపమో దానమొ యాత్రయొ
జపమో శాంతియొ మఱేదొ సలుపవలయుచోఁ
గృప మీఱఁ దెలిపి నన్ని
విపదంబుధిఁ గడవఁజేయవే మానీంద్రా!

శ్రీ వేంకటరామశాస్త్రిగారు, ఔచిత్యమును బాగుగాఁ బోషించుచుఁ, గ్రొంగ్రొత్తభావములు నడుమనడుమఁ బడవేయుచు నొక స్వతంత్రప్రబంధమో? యను నట్లీకథాసరిత్సాగరము నాంధ్రీకరించిరి. ఈక్రిందిపద్యములలోని రసనైర్మల్యము, పదవిన్యాసము, నర్థసంపదయు వేనోళ్ల శ్లాఘనీయము లనుట కేమైన సందేహ మున్నదా?

చ. ఒడలిబెడంగుతో నడలయొప్పులతో స్మరవిభ్రమంబుతో
వెడవెడ నవ్వుతోఁ గనులవెల్వడు చూపులసోయగంబుతోఁ
దొడరెడు ప్రేమచిహ్నములతో వలపుల్ దులకించు లీలతోఁ
గడుకొను వేడ్కతోఁ బొలుపుగావిహరింపుచు నన్యోన్యనన్.

సీ. చూపులు సుమనోజ్ఞశుద్ధాంతకామినీ
వదనాబ్జములమీఁద వ్రాలి నిలువ
మదిరారసాస్వాదమాత్రసమాసక్తి
రసన తదేకపారణ మొనర్ప
వీను లానందాబ్ధి వీచీరవసదృక్ష
కలవిపంచీరాగకళలఁ దనియ
నిరతంబును దృతీయపురుషార్థసంపాద
నాస్థమై బుద్ధి నైయ్యమున నలర

ఆ. వె. వత్సవిభుఁడు సకలవైభవదేవేంద్రుఁ
డగుచు విస్మృతాఖిలాన్యకార్య
భారవహత నాత్మపరిణీతనిజవధూ
జనసుఖోత్సవానుసక్తి నుండె.

స్థాలీపులాకముగాఁ గొన్నిపద్యముల నుదాహరించెద నని వ్రాసి యిట్లే వ్రాయఁ గడఁగినచోఁ దిరిగి కథాసరిత్సాగర మంతియు నీవ్యాసములోనికే దింపవలసివచ్చు ననెడుభయముతో నీపద్యములు మాత్రము పాఠకులకుఁ జవిచూపితిని.

వివిధవిషయములుగల యీమహాగ్రంథము నాంధ్ర వాఙ్మయ ప్రపంచమున కర్పించి యాంధ్రవాణి కనశ్వరము, నమూల్యము నగు సేవఁ జేసిన శ్రీ వేంకటరామశాస్త్రిగారికి నాయభివాదము లర్పించుచు నేతద్గ్రంథాంతమునఁ దమస్వాహంకారపరిహారభావము వెలిపుచ్చుచు శ్రీశాస్త్రులుగారు వ్రాసిన పద్యము నిక్కడ నుల్లేఖించి యీ వ్యాసము నింతటితో విరమించుచున్నాను.

క. పలుకుల వెలందియొప్పిటు
పలికించిన నట్టు లేను పలికితి దోసఁగుల్
గలిగిన మన్నింపుఁడు పె
ద్దలు రసవత్పదపదార్థతాత్పర్యజ్ఞుల్.

# గ్రంథస్వీకారము.

---

1. కర్షకా!—ఇదియొకచిన్న పొత్తము. నలువదితొమ్మిదివృత్తములుగలది. ఉభయభాషాప్రవీణులు, కొండపేటి వెంకయ్యగారు రచించినది. కర్షకునిస్థితి యిందతినిపుణముగా వర్ణింపఁబడినది. ఇది మిగులననుభవము గలిగిన కర్షకులసంబోధనము! కవనము విషయమునం దెక్కువవిలువగనఁబఱచుచున్నది. జాతీయములు, స్వభావోక్తులుం గలిగి కర్షకులదీనావస్థను గదళీపాకమున విశదముచేయుచున్నది. వ్రాఁతలోఁ బొరపాట్లు చాలభాగము సవరింపకుండ నచ్చువేయించిరి. ఉదా:- మీఁదనురక్తమొల్లఁ దిగ్రమింగి - ౨౨. నీవుకలఁగాలము - పైబడినఁభాగము - ౩౦. యథేచ్ఛనివాసము జేయ ౨౮ మొదలైనవి.

ఉ. ఎండయు వానయంచనక నెప్పటికప్పుడు బండచాకిరీ
తిండికిఁ జేయుచుండెదవు, దేవురులాడుచు నెప్పుడైన నీ
మండెడుపొట్టనింపుకొను మార్గము లేదుగదోయి యింకనో
యెండికృశించిపోయినవి యెమ్ములు సర్వమునీకు కర్షకా!

ఉ నాగలిఁ జేతబట్టి నరనాధులపాలికిఁబోయి కష్టముం
బోగలమార్గమెద్ది యనుమోయి వచింపక నూరకుండినన్
చేగలయంతివట్టు పనిచేసియె రమ్మిక కొంపముంపవా
వేగినఁ జూచుకొంద మది యెంతటిదో యని బుద్ధికర్షకా!

ఈరెండుపద్యములు నన్నివిషయములకు మచ్చు.

గ్రంథమును గవిగారు తమవిద్యాభివృద్ధికిఁ గారకులగు శ్రీ నర్రా వాసవయ్య చౌదరిగారికి నంకితముచేసిరి. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా కోసూరుపోస్టుకుఁ జేరిన విప్పర్ల గ్రామములోని కవిగారికి వ్రాసిన నూరకయే పుస్తకమును బంపెద రని తోఁచుచున్నది.

---

2. తోరణము:- మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు కవి. ఆంధ్రకుటీరము, తొలిపువ్వు. మాతామహులగు రామమూర్తిగారివత్సలత కర్పణము చేయఁబడినది. 40 పుటలలో 40 పద్యములుం బుటకొక్కొక్కటిగా ముద్రింపఁబడినవి. పద్యములన్నివిధముల హృద్యము

గానున్నవి. "మంచిత్రోవఁబోవుదము రండు ధీరాంధ్రపుత్రులారా!" యని మొదటినుండి బోధించినారు.

" నోడువఁ జాలనియిడుమలఁ గుడిచి బడలి
చిక్కిజీర్ణించి నిజదేశ సేవఁ జేసి
తుదకు స్మరణీయులైన యాంధ్రులఁ దలంప
గాజు కన్నైన నొక యశ్రుకణము రాల్చు. ౨

"ఆంధ్రభాషాభివృద్ధియు, నాంధ్రదేశ
భాగ్యవృద్ధియు నేనాఁడు పడయనగునొ
యప్పుడే యాంధ్రశబ్ద మన్వర్థమగును
ఘనయెడలఁ గానిచో నామమాత్రమగును. 3

పితృశిక్షను లెక్కసేయకున్న యొక్కకుమారునికిఁ దండ్రి దినదిన మొక్క రూపాయయిచ్చి లోఁబఱుచుకొని రామాయణభారతాదులు తన నిమిత్తమై చదువుమని క్రమక్రమముగా సన్మార్గమునకు దింపిన ట్లొకచిన్న కథయున్నది. కవిగారికి, పల్లెపాలెము వ్రాసినదొరకును.

---

3. శ్రీశంకరాచార్యజీవితసంగ్రహచరిత్రము-గ్రంథకర్త శ్రీ కృత్తివెంటి లక్ష్మీనారాయణగారు. పదియధ్యాయములు- డెబ్బదిరెండుపుటలు - వచనకావ్యము - శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీవిమలానంద భారతీస్వాములవారి పూర్వపీఠికతోఁ గూడినది. కంకటావ దేవస్థానములోఁ బ్రతిష్ఠింపఁబడిన శ్రీశంకరాచార్యుల ఛాయాపటము ముఖపత్రమునఁగలదు. పీఠికవ్రాసిన శ్రీవిమలానందస్వాములపటము లోనఁగలదు. శ్రీశంకరుల జీవితచరిత్ర మిందుఁ జక్కగ సంగ్రహరూపమున వ్రాయఁబడినది. భాష నాతికఠినముగానున్నది. విషయము సంగ్రహముగానున్ననుఁ జదువరులకుఁ గావలసిన ముఖ్యవిషయములు విడువఁబడలేదు. మన్మతస్థాపనాచార్యులగు శ్రీశంకరాచార్యులచారిత్రమును మతాభిమానము గల యెల్లవారునుఁ జదివితీరవలయును. గ్రంథము బందరులోని నర్సిల్లి పేటలోని కృత్తివెంటి లక్ష్మీనారాయణగారి యొద్ద నాలుగణాలకు దొరకును.

---

౧౧౮. అనన్యలభ్యః శబ్దార్థః.

ఒకశబ్దముయొక్క యర్థ మితరసాధనములవలనఁ దెలియఁబడదు. ఈన్యాయము తంత్రవార్తికములో ౩౮౦ పుటలో నున్నది.

"యావానేవహి అనన్యలభ్యః అర్థః శబ్దాద్గమ్యతే ససర్వః శబ్దార్థః"

కుసుమాంజలికారుఁడైన ఉదయనాచార్యుఁడు శబ్దార్థవిషయమయి యిట్లు వ్రాయుచున్నాఁడు.

"యశ్శబ్దో యత్ర వృద్ధైరసతి వృత్త్యంతరే ప్రయుజ్యతే స తస్య వాచకో యథా స్వర్గశబ్దః సుఖవిశేషే ప్రయుజ్యమానః తస్య వాచకః.

౧౧౯. అనిషిద్ధ మనుమతమ్

నిషేధింపఁబడనిది యనుమతింపఁబడును. ఇది హేమచంద్రుని పరిశిష్టపర్వము ౮-౩౬ లో నున్నది.

"ఏతస్యాః సంప్రదానం చ శ్రుత్వా సంశోధవానసి
అనిషిద్ధం హ్యనుమత మపి న్యాయోపి వర్తతే"

౧౨౦. అన్తరఙ్గబహిరఙ్గయో రన్తరఙ్గో బలీయః.

అంతరంగబహిరంగములలో నంతరంగము బలమైనది.

ఇది శీరదేవుని పరిభాషలలోఁ గనఁబడుచున్నది. మఱియొకపండితుఁ డంతరంగబహిరంగశబ్దములకి ట్లర్థమును జెప్పెను.

"అన్తర్మధ్యే బహిరఙ్గశాస్త్రీయనిమిత్త సముదాయమధ్యే అన్తర్భూతా న్యఙ్గాని నిమిత్తాని యస్య తదన్తరఙ్గం ఏవం తదీయనిమిత్త సముదాయాత్ బహిర్భూతాఙ్గకం బహిరఙ్గం."

ఈన్యాయము శబరస్వామి పూర్వమీమాంసాభాష్యములో ౧౨-౨-౨౭ లో నుదాహరించెను.

"కార్యస్య తావ దుపాదానాపేక్షా ప్రథమ ముత్పద్యతే పశ్చాద్విరోధిసంసర్గాభావాపేక్షా త థాచాన్తరఙ్గబహిరఙ్గయో రన్తరఙ్గంబలవ దితి న్యాయే నాన్తరఙ్గోపాదానవిషయత్వ మేవ తయో ర్న్యాయ్యమ్"

౧౨౧. అన్యవేశ్మస్థితా ద్ధూమా న్నవేశ్మాన్తర మగ్నిమత్.

ఒక యింటినుండి కనఁబడుచున్న ధూమమువలన మఱియొక

యిల్లు ధూమము కల దని మన మూహింపఁ గూడదు. జైమినిసూత్ర
మును గుఱించి తంత్రవార్తికములో నిట్లు చెప్పఁబడియున్నది.

అనుమానవ్యవస్థానాత్ తత్సంయుక్తం ప్రమాణం స్యాత్.

౧౨౨. అన్యార్థ మపి ప్రకృత మన్యార్థం భవతి.

ఒక ప్రయోజనము కొఱకుఁ జేసిన యొకవస్తువు మఱియొక ప్రయో
జనముకొఱకుఁ బనికివచ్చును.

ఈన్యాయము మహాభాష్యము ౧-౧-౨౩ లో నున్నది.

“యత్తావ దుచ్యతే న చాన్యార్థం ప్రకృత మన్యార్థం భవతీ
త్యన్యార్థ మపి ప్రకృత మన్యార్థం భవతి. త ద్యథా-శాల్యర్థం కుల్యాః
ప్రణీయన్తే తాభ్య శ్చ పానీయం పీయత ఉపస్పృశ్యన్తే చ శాలయ శ్చ
భావ్యన్తే”

౧౨౩. అవచ్ఛేదన్యాయము.

దీనికే పూర్వాపరావచ్ఛేదన్యాయ మనిపేరు. జ్యోతిష్టోమము
లో, ప్రథమసవనమందు ఉద్గాత, అధ్వర్యుఁడు, హోత, మొదలగు
ఋత్విక్కు లొకనిని మఱియొకఁడు పట్టుకొని చుట్టుగాఁ దిరుగుదురు. ఇందు
లో నెవ్వఁడైన నొకఁడు ముందు నడచుచున్న మఱియొకనిని విడిచిన,
యెడల దాని కేకకర్తృకావచ్ఛేద మని పేరు. ఇది వేదాంతకల్పతరుపరి
మళమం దిట్లు వివరింపఁబడినది.

“జ్యేష్ఠ స్యాపీతి అవచ్ఛేదన్యాయేన ఊర్ధ్వస్య పరేణ బాధ మాశం
క్య తదపేక్ష్య స్యేతి విశేషితం తేనోత్తరస్య ఉర్వాపేక్షాయా ముపక్ర
మాధికరణన్యాయ ఏవ ప్రవర్తత ఇతి సూత్రిత మిత్యర్థః.”

౧౨౪. అపవాదై రుత్సర్గా బాధ్యన్తే.

అపవాద యనఁగా సామాన్యశాస్త్రము, ఎట్లనఁగా “న హింస్యా
త్సర్వభూతాని” ఏజంతువును హింసింపఁగూడదు. ఉత్సర్గశాస్త్రము-
అనఁగా, విశేషశాస్త్రము. ఇది యపవాదను బాధించునది. ఎట్లనఁగా-
“అగ్నీషోమీయం పశు మాలభేత” (యజ్ఞమందు, అగ్నీసోములకు దేవ
తగాఁ గలపశువును హింసింపవలె నని విధి.)

ఈ న్యాయము కుమారసంభవము రెండవసర్గ ౨౭ వ శ్లోకములో నున్నది.

"ఉద్ధృతేష్వివశేషేషు చేత్సర్వేషు స్వయంవరే
అథవా మే రిపోత్పన్నా కృతవ్యాపృత్తయః పరైః"

౧౨౫. అభ్యర్హితం పూర్వమ్.

పూజనీయులు ముందు రావలయును. ఇది పాణిని సూత్రములలో నొక సూత్రము. "అభ్యర్హితం పూర్వం నిపతతీతి వక్తవ్యం" "మాతాపితరౌ" "శ్రద్ధా మేధే" జైమినీయ న్యాయమాలావిస్తరమందు ౧౨ వ యధ్యాయములో నీన్యాయము కనిపించుచున్నది.

"అభ్యర్హితం పూర్వ మితి న్యాయ ముక్తిత్వ తస్త్ర ప్రసఙ్గ ప్రతిపాదకయో రేకాదశద్వాదశాధ్యాయయోః పూర్వోత్తరభావ ఉపపాదితః"

౧౨౬. అంబుని మజ్జన్త్యలాబూని గ్రావాణః ప్లవన్తే.

తఱచుగా నీన్యాయ మొకదుర్ఘటమైనదాని నుదాహరించుటకుఁ జెప్పఁబడును. ఇది మహాభారతము సభాపర్వములో ౬౪ వ అధ్యాయములో నున్నది.

"మజ్జన్త్యలాబూని శిలాః ప్లవన్తే ముహ్యన్తి నావోఽమ్భసి శశ్వ దేవ" నీటిలో, అనుగపుకాయలు మునుఁగుచున్నయవి. రాళ్లు తేలుచున్నవి.

౧౨౭. అయ మపరో గణ్డ స్యోపరి స్ఫోటః.

ఒక వ్రణముపైని మఱియొక వ్రణము- అనఁగా నొకకష్టముపైని మఱియొకకష్టము వచ్చునప్పు డీన్యాయము ప్రవర్తించును.

శాకుంతలములో రెండవయంకము, ప్రాకృతము, "తదో గండస్స ఉవరి పిడఆ సంవుత్తా".

౧౨౮. అరుణైకహాయనీన్యాయము.

ఇది పూర్వమీమాంసలోనిది. ఒకసంవత్సర మీాడు గలది, యెఱ్ఱనిరంగు గలది యగు నావు వెయ్యను బెట్టి సోమమును గొనవలెను. ఈన్యాయము తంత్రవార్తికము ౧-౨-౪౧ న్యాయమంజరి ౨౯౪ పుట, వేదాంతకల్పతరుపరిమళము, పుట ౬౧౯ మొదలగు గ్రంథములలోఁ

రస్మా దుత్పత్తి ర్భవిష్య త్యవిరవికన్యాయేన త ద్యథా-అవే ర్మాంస మితి విగ్రహే అవికశబ్దా దుత్పత్తి ర్భవతి ఆవిక మితి ।

ఇట్టిశబ్దము లష్టాధ్యాయీసూత్రములలో ననేకములు చెప్పఁబడినవి. "క్రతూక్థాది సూత్రాన్తాత్ ఠక్" ౪.౨-౬౦ క్రతువిశేషవాచకము లైన ఉక్థాదిశబ్దములకు సూత్రశబ్దాంతము దున్న కల్పశబ్దమునకు ఠక్ ప్రత్యయము వచ్చును. ఎట్లనఁగా;—ఉక్థశబ్దము, కొన్నిసామలయందు రూఢము. త దధీతే- త ద్వేద వా- అనునర్థమందు-

అగ్నిష్టోమ మధీతే వేద వా- ఆగ్నిష్టోమికః । వాజపేయికః। ఔక్థికః। లౌకాయతికః । వార్తికసూత్రికః । సాఙ్గ్రహసూత్రికః । కల్పసూత్ర మధీతే కాల్పసూత్రః। వాయసవిద్యకః। సార్పవిద్యకః। ఆశ్వలక్షణికః। ఇత్యాదులు—

౧౩౨. అశ్వారూఢాః కథం చా శ్వాన్ విస్మరేయు స్సచేతనాః.

బుద్ధిమంతు లైనరౌతులు తా మెక్కినగుఱ్ఱముల నెట్లు మఱచెదరు. వ్యాకరణశాస్త్రకర్తలు తాము వ్రాసిన కట్టుఁబాట్లను లక్ష్యముసేయక తమయిచ్ఛకొలఁది శబ్దములను బ్రయోగింతురు. ఈవిషయమందుఁ బైన్యాయము ప్రవర్తించును. పాణిని "అల్పాచ్తరం పూర్వమ్" ద్వంద్వసమాసములో నల్పాచ్చులు గలశబ్దము ముందుండవలయు నని నిబంధనముచేసి తనసూత్రములలోఁ దానే యీకట్టుఁబాటు నుల్లంఘించెను. ఎట్లనఁగా; "లక్షణహేత్వోః క్రియాయామ్" అను సూత్రమందు, అల్పాచ్చ మైన హేతుశబ్దమును వెనుకకుఁ ద్రోసి యతకంటె నెక్కు డచ్చులుగలలక్షణశబ్దమును ముందుంచెను. ౧-౩-౧౫, తంత్రవార్తికమందు కుమారిలభట్టు గొప్పశాబ్దికు లైన గ్రంథకర్తలు కూడ నపశబ్దములను బ్రయోగించి రని వ్రాసెను. "అన్తో నా స్త్యపశబ్దానా మితిహాసపురాణయోః" అని పలికెను. ఇందులకు "ఉభాభ్యా" అను నొకవిచిత్రమైన శబ్దము నుదాహరించెను. ఏనుఁగు రెండుదంతములతోను గొట్టినదెబ్బ యని దీనికర్థము. అతఁ డాగ్రంథమందే యిట్లు వ్రాసెను.

"యేపి వ్యాకరణ స్యైవ పరేపారే ప్రతిష్ఠితాః।
సుతరాం తేపి గావ్యాది తుల్యా నేవ ప్రయుఞ్జతే।
సూత్రవార్తికభాష్యేషు దృశ్యతే చాపశబ్దనం।
అశ్వారూఢాః కథం చాశ్వా న్విస్మరేయు స్సచేతనాః"

౧౩౩. అసిధారామధులేహనన్యాయము.

కత్తిదారుపైఁ దేనెచుక్క లుంచి నాకుట. ఈన్యాయము సర్వదర్శనసంగ్రహములో జైనమతవివరణమం దున్నది.

"సదసద్వేదనీయస్య సుఖదుఃఖోత్పాదకత్వ మసిధారా మధులేహనవత్"

బోధిచార్యావతారమందు ౭-౬౪.

"కామై ర్న తృప్తి స్సంసారే క్షురధారామధూపమైః"

౧౩౪. అహృదయవచసా మహృదయ ముత్తరమ్.

మతిలేని ప్రశ్నలకు మతిలేనిజవాబులు. ఈన్యాయము వేదాంతతత్త్వబిందువు- ౧౪ పుటలో నున్నది.

"తత్ర చాహృదయవచసా మహృదయ ముత్తర మితి న్యాయేన సదసత్త్వం ప్రపంచ స్యోక్తం। న తు తత్త్వాభిప్రాయేణ".

౧౩౫. అసాధారణ్యేన వ్యపదేశా భవన్తి.

ఒకదాని కొకగొప్పతన మున్నచో దీనినిబట్టి దానికిఁ బేరు వచ్చును. ఈన్యాయము సాంఖ్యసూత్రము ౫-౧౧౨ సూ. లో నున్నది.

"సర్వేషు పృథివ్యుపాదాన మసాధారణ్యాత్ తద్వ్యపదేశః పూర్వవత్"

సర్వదర్శనసంగ్రహములో-అక్షపాదమతవివరణము-

"నను ప్రమాణాదిపదార్థషోడశకే ప్రతిపాద్యమానే కథ మిదంన్యాయశాస్త్ర మితి వ్యపదిశ్యతేఽసత్యం। తథా ప్యసాధారణ్యేన వ్యపదేశా భవన్తీతి న్యాయేన న్యాయస్య పరార్థానుమానా పరపర్యాయస్య న్యాయస్య సకలవిద్యానుగ్రాహకతయా సర్వకర్మానుష్ఠాన సాధనతయా ప్రధానత్వేన తథా వ్యపదేశో యుజ్యతే"

## ౧౩౬. కరిబృంహితన్యాయము.

కరిబృంహితము=ఏనుఁగుయొక్క యఱపు-"బృంహితం కరిగర్జితం"అని యమరము చెప్పుచుండఁగా-బృంహితశబ్దమే యేనుఁగఱపని యర్థమిచ్చుచుండఁగా నిచటఁ గరిశబ్ద మనవసరము లేదు. కాని రఘునాథుఁ డను గ్రంథకర్త దీని నిట్లు సమర్థించుచున్నాఁడు. "విశిష్టవాచకానా మపి పదానాం సతి పృథగ్విశేషణవాచకపదసముపధానే విశేష్యమాత్రపరతాయాం కరిబృంహితన్యాయః ప్రవర్తతే"- కావ్యప్రదీపము, సప్తమోల్లాసములోఁ బరియుపశ్లోకమును జూడుఁడు- "సౌన్దర్యసమ్పత్తారుణ్యం యస్యాస్తే తే చ విభ్రమాః। షట్పదా న్పుష్పమాలేవ కా న్నాకర్షతి సా సఖే." ఇందులకు కావ్యప్రదీపకారుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు. (౨౦౫ పుట)

"మాలాశబ్దో యద్యపి పుష్పస్యైవ స్రజి శక్తస్తథాపి న పుష్పపద మపుష్టార్థం లక్షణయోత్కృష్టత్వ ప్రతిపాదకత్వాత్। అయ మేవ కరిబృంహితన్యాయః"

ఈవిషయమును యుదాహరణచంద్రికాకారుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు.

"అత్ర నిరుపపదా న్మాలాశబ్దా దేవ పుష్పస్రక్ప్రతీతేః పుష్పపద ముత్కృష్టపుష్పత్వే సంక్రమితవాచ్యం। ఏవ మేవ కరిబృంహితాదిషు బోధ్యం"

ఇట్టివింకొన్ని న్యాయముల రఘునాథుఁ డుదాహరించియున్నాఁడు.

1. గజఘటాన్యాయము, 2 నీలేందీవరన్యాయము, 3. పర్వతాధిత్యకాన్యాయము, 4. పర్వతోపత్యకాన్యాయము. 5. వాజిమందురాన్యాయము, 6. కరికలభన్యాయము, 7. చూడావతంసన్యాయము, 8. మృగవాగురాన్యాయము, 9. చంద్రజ్యోత్స్నాన్యాయము, 10. ధనుర్జ్యాన్యాయము మొదలగునవి.

## ౧౩౭. ఆర్ద్రం వస్త్రం సమన్తా ద్వాతానీతం రేణుజాత ముపాదత్తే.

గాలి కెగురఁగొట్టఁబడిన తడిబట్టకు రేణువు లంటుకొనును. ఇది సర్వదర్శనసంగ్రహములో జైనమతసంగ్రహమం దున్నది.

"యథార్ద్రం వస్త్రం సమన్తా ద్వాతానీతం రేణుజాత ముపాదత్తే తథా కషాయజలార్ద్రం ఆత్మా యోగానీతం కర్మ సర్వప్రదేశై ర్గృహ్ణాతి యథా వా నిష్టప్తాయః పిండే జలే క్షిప్తే ర్భ్యః సమన్తా ద్గృహ్ణాతి తథా కషాయోష్ణో జీవో యోగానీతం కర్మ సమన్తా దాదత్తే"

౧౩౮. ఆషాఢవాతే చలతి ద్విపేన్ద్రే చక్రీవతో వాఽధి రేవ కాష్ఠా.

ఆషాఢమాసములో వీచుగాలియొక్క బలముచేత బలవంత మైన యేనుఁగు సైతము నిలువ లేనపుడు గాడిదపని చెప్పెడి దేమి? ఈన్యాయము వేదాంతశిఖామణిలో నున్నది.

"వామదేవాదీనా ముత్పన్న బ్రహ్మసాక్షాత్కారాణా మ ప్యయుక్తా ప ర్వాచీనానా మాషాఢవాతే చలతి ద్విపేన్ద్రే చక్రీవతో వాఽధి రేవ కా ష్ఠేతి న్యాయేన ముక్తి ర్దూరోత్సారితా స్యాత్"

౧౩౯. ఇతో వ్యాఘ్ర ఇత స్తటీ.

ఇటువైపునఁ బెద్దపులి, యిటువైపునఁ బ్రపాతము. "అటువైపు నుయ్యి యిటువైపు గొయ్యి" అని తెలుఁగులోఁ గూడ నొకసామెత గలదు. ఇది యాచార్యహేమచంద్రుని పరిశిష్టపర్వము- ౩-౧౩౭ పుట లో నున్నది.

"కుటుమ్బ మపి మే ప్రేయః ప్రేయాం స్త్వ మపి హే సఖే
కిం కరోమి ద్విధా చిత్త మితో వ్యాఘ్ర ఇత స్తటీ"

మఱియొకయుదాహరణము స్యాద్వాదమంజరిలో నున్నది. ౧౧౧ పుట.

"అవాస్తవత్వగ్రాహకం ప్రమాణం సాంవృత మసాంవృతం వా స్యాత్ యది సాంవృతం కథం తస్మా దవాస్తవా ద్వాస్తవస్య శూన్యవాదస్య సిద్ధిః ప్రాప్తా తథా చ వాస్తవ ఏవ సమస్తోపి ప్రమాత్రాదివ్యవహారః అథ సద్గ్రాహకం ప్రమాణం స్వయ మసాంవృతం తర్హి క్షీణాః ప్రమాత్రాదివ్యవహారాః వాస్తవత్వప్రతిజ్ఞాతే నైవ వ్యభిచారాత్ త దేవం పక్షద్వయే పీతో వ్యాఘ్ర ఇత స్తటీతి న్యాయేన వ్యక్త ఏవ పరమార్థత స్స్వాభిమత సిద్ధివిరోధః"

౧౪౦. ఇష్యమాణ స్యైవ ప్రాధాన్యం న తద్విచ్ఛాయాః.

కోరికకంటెఁ గోరఁబడువస్తువునకుఁ బ్రాధాన్యము.

గళితశాత్రవదైత్యకామినీతాటంక
కలితలంకాపురీగ్రావభేదనటంక
ధూమ్రరక్షహరణైకదోశ్శక్తిబిరుదాంక
కమ్రప్ర వఘనకాంతిజితఘనాఘనాంక. ౨

ఛత్రిక:—

౧ అని రామలక్ష్మణులఁ
౨ గాని డాఁచుమద్గుణుల
౩ నలరసాతలలంకఁ
౪ గలఁచి త్రుంచి కడుకఁ
౫ బుడమి కౌరాఘవుల
౬ పడఁదెచ్చి కడుమిత్రుల
౭ వెలయు దీనశరణ్య
౮ యలఘుపుణ్యాశరణ్య.

సార్వవిభక్తికము:—

శా. నీ వాద్యుండవు నిన్నుఁ గొల్తు నెపుడున్ నీచేత శ్రీ మించె నీ
కై వేమ్రొక్కు లొనర్తు నీవలన నిష్టార్థంబు సంధిల్లె నీ
కే వైరుల్భయ మందఁ గుందు మది నూహింపంగ నీయందు శౌ
ర్యావిర్భావజయంబు లెచ్చెను జగత్ప్రాణోద్భవా ధీనిధీ.

ఉ. లక్షణసారసంగ్రహమిళత్కలనామతిసన్నుతోపమో
త్ప్రేక్షలు మీఱఁ జిత్రకవి పెద్దన యొప్పుగఁ జేసె మీకు నో
యక్షయశౌర్య యీభవదుదాహరణంబు జగత్ప్రసిద్ధి యై
యాక్షితి మించఁ జేయుము మహీతనయాధిపపాదసేవకా.

క. హీరావళి మొదలయినవి
యారయఁగాఁ గలవు పెక్కుదాహరణంబుల్
ధీరు లెఱిఁగి రచియింతురు
సారాలంకారశాస్త్రసరణిన్ ధరణిన్.

—:సీసలక్షణములు:—

వ. సీసంబు లన్నవి సమసీసంబులును విషమసీసంబు లన రెండువిధంబు లయ్యె నందు సమసీసంబు లెట్టి వనిన.

క. అనిమిషపతిపట్టముపై
నినయుగ మగు నంఘ్రి దాన నిరుచోట్ల యతుల్

చను నవి నా ల్గడుగులపైఁ
గొన నొకగీతియు నమర్చికొన సీస మగున్.

సీ. అంఘ్రికి విశ్రాంతి యగును మూఁడవగణా
ద్యక్షరం బిరుచోట్ల నమర నదియు
వరుసఁ బ్రాసం బేని వళి యేని యొకటితోఁ
జెప్పిన నగు సమపీస మొకటి
దీనిపైఁ గృతులలోఁ బూనికిఁ జేయుని
యమములు ప్రాసపీసము ననంగఁ
జెలఁగు వృత్తప్రాససీసంబు సర్వతః
ప్రాససీసము ననఁ బరఁగు మఱియు
*నక్కలిప్రాససీసంబు ననఁగను వడి
సీసమన నవకలివడిసీస మనఁగ
నా ఱగు విషమసీసంబు ననఁగ సర్వ
లఘువుసీసంబు నివి రెండు రఘుపతిహిత.

సీ. ప్రాసంబు నాలుగు పదముల నిల్పఁజే
సినను వృత్తప్రాససీస మగును
బశ్చిమార్ధము లట్ల ప్రకటించి పెనఁచి కూ
ర్చిన నక్కలిప్రాససీస మగును
మొదల నెత్తినయతి పదమునం దెల్లను
నమరింప వడిసీస మనఁగఁ దగును
నర్ధమర్ధమునకు యతులు వేఱై యుండఁ
జేయవకలివడిసీస మెనయు
నాలుచోట్లను బ్రాసంబు లంటెనేని
నది సమప్రాససీసంబు నన్నిచోట్లఁ
బ్రాస మంటిన సర్వతఃప్రాససీస
మగు విషమసీస ముత్సాహ యగా గీతి.

---

* కవిజనాశ్రయము, అప్పకవీయము 'అక్కిలి' యని.

క. ముప్పదియార్లఘువులతో
గొప్పడుగుల దశమయతులు గొని యిరుచోట్లన్
దప్పక తుద నొకగీతియుఁ
జెప్పిన నది సర్వలఘుసీసం బయ్యెన్.

వ. ఈ తొమ్మిదిసీసంబులందును మొదలిసీసంబు సమసీసం బనం బరఁగెఁ
దదుద్భవం బైన ప్రాససీసంబులక్ష్యంబు లె ట్లనిన.

సీ. బంధురవసతు లై పాండవు ల్వనవాస
భరవృత్తిఁ దిరుగుచుఁ బరఁగువేళ
గంధయుక్తము లైన కనకసౌగంధిక
కంజంబు లనిలసంగతినిఁ జేసి
సంధిల్లి రా వారిసతి చూచి యటువంటి
జలజము లె మ్మన్న సమ్మదమున
గంధవాహసుతుండు కడఁకతో నానీల
గళబాంధవునితోఁటకడకు రాఁగ
గంధమాదనశైలాగ్రకాననమునఁ
గరుణ నతనికిఁ ద్రోవ సాక్షాత్కరించి
బంధుగతి మీఱ నిలిచినప్రభుఁడ వనినఁ
బ్రాససీసంబు దనరు నోపవనతనయ. ౧

వృత్తప్రాససీసము:—

తాల్చె నెవ్వఁడు ధాత్రి ధర్మస్థితి యెసంగఁ
దనస్వామికార్య మెంతయుఁ గడంకఁ
గొల్చె నెవ్వఁడు ప్రేమ గురుతరస్థిరభక్తిఁ
గుంభినీజాజాని గుణాకరు
వేల్చె నెవ్వఁడు పటువీతిహోత్రోద్భూత*
విలసితజ్వాలికావితతి లంక†
నిల్చె నెవ్వఁడు ధాత్రి నిరుపమపటులీల
నిష్ఠాపటిష్ఠత నెఱయఁ బూని

* పటువీతిహోత్రోద్భూత, † జ్వాలికావితతి గ్రాఁగ. మూలము.

యట్టిహనుమంతుఁ బావనస్వాంతు నసుర
ఘనవనధ్వాంతు గుణవంతుఁ గలితశాంతు
మంతు శక్తిసప్రకటధీమంతు నెంతుఁ
జెలఁగి యిట్లు వృత్తప్రాససీసములను. ౨

సర్వతఃప్రాససీసము:—

రామాంఘ్రిభక్తుండు హేమాద్రిధీరుండు
భూమిజాశోకతమోమిహిరుఁడు
శ్రీమాణవకలోకసోముండు పుణ్యుండు
భీమపరాక్రమశ్రీమహితుఁడు
కామితఫలదుండు ధీమంతుఁ డురువాల
రోమకోద్ధూతపూర్వామరుండు
క్షేమంకరుండు సంగ్రామపురారాతి
సామజాహిత సమస్తోమకీర్తి
తామరసమిత్రతేజుఁ డుద్దామగుణుఁడు
నామది వసించు నిత్యాభిరామమూర్తి
స్వామి యన సర్వతఃప్రాసనామసీస
మై మెఱయు నిది కవిసార్వభౌమ కృతుల. 3

అక్కలిప్రాససీసము:—

గిరిచరేంద్రునిఁ గాని కీర్తింపఁగా నొల్ల
హరిభటాగ్రణిఁ గాని యభినుతింప
మరుదాత్మజునిఁ గాని మదిలోన నిల్పను
బరమవ్రతునిఁ గాని ప్రస్తుతింప
గురువిధేయునిఁ గాని కూర్చి భజింపను
సురవైరిహరుఁగాని చూచి పొగడ
శరజశౌర్యునిఁ గాని సన్నుతి సేయను
హరిజమంత్రినిఁ గాని యనుసరింపఁ

జరఁగ ననుచును నక్కలిప్రాసపీన
సరణి నిను గూర్చి వర్ణించు సాధుసుకవి
వరుల రక్షింపనేర్తువు వరము లొసఁగి
హరిముఖామరతతిగేయ యాంజనేయ. ౮

వడిసీసము:—

కపివంశమణిదీప కమనీయసల్లాప
కలితభూనుతగుణగణకలాప
కబళితోదయసూర్య కనకాద్రిసమధైర్య
కలుషాద్రిదేవనికాయవర్య
రఘురామభటచంద్ర రమ్యయశస్సాంద్ర
రణరంగవిదళితరాక్షసేంద్ర
వారాశిగంభీర వర్ణితభుజసార
వాలానిలోద్ధూతవైరివార
యనుచు వడిసీసముల నిన్ను నధికభక్తిఁ
బ్రణుతిగావింతు నాజిహ్వ పావనముగ
భక్తమానసకల్ప నాపాలివేల్ప
యబ్జసంభవభవగేయ యాంజనేయ. ౯

అవకలివడిసీసము:—

బ్రతికించె నెవ్వాఁడు బవరంబులో మూర్ఛఁ
జెందులక్ష్మణుని సంజీవిఁ దెచ్చి
మర్దించె నెవ్వాఁడు మైరావణుని బట్టి
లఘిమతోఁ బాతాళలంక సొచ్చి
రక్షించె నెవ్వాఁడు రణములోఁ గపులను
వాలహస్తము కోటవలె ఘటించి
లంఘించె నెవ్వాఁడు లవణపాథోరాశి
నవలీల నవలికి నడుగు సాఁచి

యెందు ముల్లోకముల ఘను లితని కెనయె
దశము. ఖపురివరగహనదహనుఁ డితఁ
డనుచు నవకలివడిసీస మమరఁ జెప్పి
కీర్తనము సేతు నే నిన్నుఁ గీశనాథ.

అవకలిప్రాససీసము:—

ఆర్తబంధుఁడు రామకీర్తనలోలుండు
సత్యసంధుఁడు మత్తదైత్యహరుఁడు
లంకాపురీమహాశంకకల్పార్కుండు
దళితైనసుఁడు మహాబలసుతుండు
శరణాగతత్రాణబిరుదాంకహితదూత
ధాన్యమాలిన్యఘువన్యనలుఁడు
అభ్రంకషోజ్జ్వలాదభ్రశరీరుండు
హారతారాహీరసారకీర్తి
భవనుఁ డనుచు నిట్లు నవకలిప్రాససీ
సముల నిన్ను నెంతు రమర బుధులు
శమదమాభిరామ సముదగ్రగుణరత్న
పుంజలసమపాయ యాంజనేయ.

విషమసీసము:—

గ్రాహవైరి యిరువురినులు గలసి యైన వేఱుగా
నీహఁ గూర్చి యైన గణము లేదు చేసి గురువుతో
నాహితోక్తి నాల్గుగణము లైన యతులు గూర్ప ను
త్సాహ యయ్యె విషమసీససంజ్ఞ నిది పఠింపఁగాన్
దీన నాటవెలఁది దీకొనఁ గొన నుంచి
యిటులు ప్రాలు వళ్లు నెసఁగఁ జేయ
విషమసీస మనఁగ వెలయుఁ గావ్యంబుల
నార్యచర్యగేయ యాంజనేయ.

## ద్వితీయాశ్వాసము.

సర్వలఘుసీసము:—

గిరికొనెనుకలువలును దరిచనలినము బోదవఁ
 బరువు గలచెలువుబలె మెరయుకొలన
నెఱబలిమిగల మొసలి తెఱవ శనపదసగుహ
 తెఱచుకొని రదనములు గొరికికొనుచుఁ
గఱచి మెసవినయకరి వెఱచఱవ జరరముస
 నఱుగ కుసనఖములను నరము లెసలఁ
బెరికె యెముకలు నలిగ విఱిచి కరములఁ జఱచి
 వఱదగొని రుధిరములు వఱవఁ దునిమి
దానిగర్భంబు వెడలి దాఁటి వచ్చి
కాలనేమిని భంజించి కడిమితోడఁ
జెలఁగి సంజీవికొండఁ దెచ్చితివి హనుమ
యనిన నిది సర్వలఘుసీస మగును గృతుల.

—:సీసమాలికాలక్షణము:—

క. వదిరెం డంఘ్రులనేనియుఁ
 బహునెనిమిదినేని సీసపద్ధతి స్వేచ్ఛం
 బొదలినయే నొకగీతియు
 నదికిన నది సీసమాలికాఖ్య వహించున్.

—:తరువోజ:—

సురరాడ్గణత్రయి సూర్యుతోఁ గూడి
 జోడయ్యె యతులిరు చోటుల నిటులు
గరిమతో రెండేసి గణములవీఁదఁ
 గలయ నొక్కొకయంఘ్రిగా నమరించి
చరణము ల్నాలుగు సమకొనఁ జేసి
 సత్కవిచంద్రులు సరసులౌ ననఁగ
మరుదీశసుతుఁడైనమరుదాత్మభవుని
 మహిమ లెన్నుదురు నెమ్మదినిఁ దరోజ.

చక్రపాళవృత్తము:—
వనచరవంశసంభవ భవస్తుతశౌర్యగుణాభిరామ రా
మనృపతిసేవకక్షితిజమాధవ మాధవకేక్షణామణీ
జనకసుధాసమానవిలసత్పటుకీర్తినివాస వాసవా
దినిఖిలదేవతాతతియతివ్రజవర్ణితలోక పావనా.

మణిగణనికరకందము:—
శతబలిముఖవనచరహితచతురా
శతధృతిగురుభటసవినయసుకృతీ
క్రతుభుగచలసమఘనధృతియుతురా
యతితతినుతమతి హనుమదధిపతీ !

తరళ:—
సదయవీక్షణ శత్రుశిక్షణ సంతతాత్రితరక్షణా
మృదులభాషణ మృత్యుభీషణ హృద్యసద్గుణభూషణా
వదనతావన భవ్యజీవన పాటితాసురరాడ్వనా
కదనశాంభవ కాంతివైభవ గంధవాహతనూభవా !

గద్యము:—ఇది శ్రీహనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్ర సర్వయామాత్యపుత్ర చిత్రకవిపెద్దనార్యప్రణీతం బైనలక్షణసారసంగ్రహంబునందు సర్ధసమవృత్తంబులును, విషమవృత్తంబులవిధంబులును, షట్ప్రత్యయంబులసంజ్ఞలును, ఉద్ధురమాలికావృత్తంబులపద్ధతియును, లయగ్రాహి లయవిభాతి లయహారి త్రిభంగి వృత్తంబుల తెఱంగును, చండవృష్ట్యాదిదండకంబులును, యగణాదిదండకంబులును, తగణదండకంబులును, నార్యలును, గీతులును, పెండియునందుఁ గందంబులచందంబులును, దద్భేదలక్షణంబులును, పెండుంగునందుఁగలసమవిషమగీతులలక్షణంబులును, అక్కరజాత్యాదులును, వైతాళీయవృత్తంబులును, నందుఁ జౌపదులును, షట్పదత్రిపదద్విపదమంజరులనిర్ణయంబులును, రగడభేదంబులును, వీరావళ్యాద్యుదాహరణలక్షణంబులును, సీసపద్యలక్షణంబులును, అందు సమసీస విషమసీసంబుల చందంబులును, దర్పణోజసంజ్ఞలం గల్గినయిది ద్వితీయాశ్వాసము.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు; పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు—ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వేంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు, (కోశాధ్యక్షులు).

వెద్దాది రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ., ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. యల్.

అకికి వేంకట్రామయ్యగారు

కేశవపు రామరాజుగారు

కోకా వేంకటసుబ్బారావునాయుడుగారు

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు

పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మారావునాయఁడుగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

—ప్రథమభాగము—

ఇది బహువిధముల నాంధ్రనిఘంటువు లన్నింటికంటె మిక్కిలి శ్రేష్ఠమైనది. సంస్కృతపదములకుఁ, దెనుఁగుపదములకు వానిప్రయోగములకుఁ దడవికొననక్కఱలేదు. విద్యార్థులకుఁ గవులకు నీనిఘంటు వనేకవిధముల సమస్తసహాయమును జేయును.

సాదాప్రతి రు 5 లు. అట్టపేపరు ప్రతి రు 7 లు.

---

# రఘునాథరామాయణము.

ప్రథమభాగము.

తంజావూరు రఘునాథభూపాలుఁడు రచించినదానిలోని కొంత భాగము! ఈభూపాలునికే చేమకూర వేంకటరాజకవి విజయవిలాసము నంకితముచేసినది. ఈరాజకవి కవిత్వము మృదుమధురమైనది. కల్పన లతిమనోహరములు, పాఠకలోక మీతని ద్విపదనలచరిత్రమును, వాల్మీకిచరిత్రమును జదివియేయుందురు, కావున, మేము వేఱుగఁ జెప్పనక్కఱయుండదు.

వెల రు. 0-8-0

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యదర్శులు, కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Ptg. Works, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౭ } బహుధాన్యనామసంవత్సరము. శ్రావణభాద్రపదమాసములు. { సంచిక 3





కాకినాడ:

కొత్తపల్లి సూర్యారావుచే బరిషత్కార్యాలయమునఁ

బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦

విడిసంచిక, రు. ౦-౮-౦.

1938 ఆగష్టు, సెప్టెంబరు.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

మూడు నెలల కొకసారి ప్రకటింపబడును.

| | | |
|---|---|---|
| సంపుటము, ౨౭ | బహుధాన్యనామసంవత్సరము.<br>శ్రావణభాద్రపదమాసములు. | సంచిక ౩ |


## పాఠకులకు మనవి.

ఇప్పటికి బహుధాన్యసంవత్సరము (౨౭ వ సంపుటము) లో మూడు సంచికలు వెలువడినవి. చందాదారులు తాము పంపవలసిన చందాలను పంపి పరిషత్తునకుఁ దోడ్పడుదు రని విశ్వసించుచున్నాము. పత్రికా ముద్రణమునకు వలయు కాగితము సకాలములో దొరకకపోవుటచే నీ సంచికలను ముద్రించుటలో నాలస్యమగుచున్నది. అట్టి యాలస్యమేమియును లేక ముందుసంచికలు ప్రకటింపబడును.

కార్యదర్శులు.

# సందేహము.

కొత్తపల్లి సూర్యరావు, కాకినాడ.

---

ఈసకుమ నన్నయభట్టారకవిలాసములో సభ్యసమావేశ మైనది. అందులో భారతము మొదటి మూఁడు పర్వములును దీక్షగాఁ జదువుట సభ్యులకొక్క యుత్సాహకార్యము గావున నాదిపర్వమును బఠించుచుండిరి. ఈసభ్యుల నియమములు మున్ను గునవి పలువురు జనవాణి మొదలగు పత్రికలలోఁ జదివియే యుందురు. పలువురు పలుతావులఁ జదువుచున్న సందర్భములో దీక్షగాఁ జదువుచుండుటచే సందేహములు కొన్నికొన్ని గలుగుచువచ్చినవి. వాని నాసభలో నందఱు నొక్కచోఁ జేరి చర్చించిరి. దాని సారాంశ మీక్రింద నిచ్చుచున్నాఁడను.

"సీ. తాలాభ మగువిల్లు దాల్చి విరోధుల
నెగుచుచు నున్నవాఁ డింద్రతనయుఁ
డాతని కెలన మహావృక్షహస్తుఁడై
యున్నవీరుండు వృకోదరుండు
యంత్రంబు నరుఁ డేసినప్పుడు వోయిన
యాగారవర్ణుండు యమతనూజుఁ
డాతనితోడన యరిగిన యిరువురుఁ
గవలవా రర్కప్రకాశతేజు
లనిన లక్కయింట నగ్నిదాహంబున
నెట్లు బ్రదికి రొక్కో యిమ్మహాత్ము
లెట్టి పుణ్యదినమొ యేవురఁజూచితి
మనుచు సంతసిల్లె హాలధరుండు." 7 ఆ. 195 ప.

అనుదాని నొకరెత్తుకొనిరి.

"వ. అయ్యవసరంబున ధర్మనందనుండు నకులసహదేవానుగమ్యమానుండై నిజనివాసంబునకుం జనియె నిట ధృష్టద్యుమ్న సహితుండయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహాయుండయి నిలిచె."

అని యొకరు చదివి (7ఆ.187) చూపిరి.

చ. అని మొన నట్లు దాఁకినమహారథులన్ ధృతరాష్ట్రరాజనం
దనుల బలాఢ్యులన్ దళితదర్పులఁ జేసినవారు ధర్మనం
దనయము లుగ్రవీరు లని తద్విధమంతయు నేర్పడంగఁ జె
ప్పినవిని కౌరవప్రభుఁడు వెల్లువఁ తద్దయు దుఃఖితాత్ముఁడై. ఆ. 8. 11.

అనుపద్య మింకొక్కరు గనఁబఱిచిరి.

సాధారణముగా నీవిలాసనభ్యులు కవిత్రయమువారి భారతము లోని పదములు ప్రయోగములు నర్థములు నిట్టి వానినే గణించువారు గాని కథలలోని పూర్వాపరసందర్భాసందర్భములను విచారించువారు కారు కాని యానాఁడు గొంత చర్చ జరిపిరి.

యంత్రంబు నరుఁ డేసినప్పుడు ధర్మతనయుఁడు నకులసహదేవాను గమ్యమానుఁడై నిజనివాసంబునకుఁ జనియెఁగదా "ధృతరాష్ట్రరాజనం దనులను బలాఢ్యులను దళితదర్పులను జేసినవారు ధర్మనందనయము లెట్లయిరి. నాలుగైదు ముద్రణములలోని భారతపాఠములందీసి చదివిరి. అన్నియు నిట్లే యున్నవి. కాని చదలువాడ సుందరరామశాస్త్రిగారును దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారును—టీకాతాత్పర్యములతోఁ బ్రకటించిన యాదిపర్వములో మాత్ర మొక్కింత చర్చించిరి:—8వ యా శ్వాసము 11వ పద్యము తాత్పర్యములో "ధర్మరాజు నకులసహదేవులఁ తోఁగూడ యుద్ధమునకు ముందే నివాసమునకుఁ బోయినట్లు సప్తమా శ్వాసము 187 వచనమునందుఁ జెప్పఁబడినది. ఇట నేతత్పద్యార్థము దానికి విరుద్ధముగాఁ గనఁబడుచున్నది. కావున అట నివాసం బనఁగా స్వయంవరస్థానమున వారు పూర్వ ముండిన స్థల మని యర్థము చెప్పి విరోధపరిహారము చేయవలెను. మత్స్యయంత్రము తెగనేసినప్పుడు కలి గిన సంరంభమునఁ దమతమస్థలములు విడిచి పోయి యుండి మరల నా చోటికి వచ్చియుండవచ్చును. యుద్ధప్రసంగంబున ధర్మరాజు నకులసహదే వులు యుద్ధముచేసినట్లు వర్ణింపకుండుట సంక్షేపార్థమై యుండవచ్చును" అని లిఖించిరి. ఇది సభ్యులకు రుచింపలేదు.

సంస్కృతములో నేమున్నదో యని చూడఁబోయిరి. మీఁద నట్లు వ్రాసినవారు మూలము చూడకుండఁగనే తమ యభిప్రాయము నిచ్చి యుందు రని తలంచిరి. శ్రీ వావిళ్లవారు నూతనముగా నచ్చువేయించిన దక్షిణదేశపాఠప్రతినిజూచిరి. స్వయంవరపర్వములో ౧౮౩ వ అధ్యాయ ముకడ ౫౦-౫౧ శ్లోకములలో—

"తం వృక్షమాదాయ రిపుప్రమాథీ దణ్డీవ దణ్డం పితృరాజ ఉగ్రమ్
తస్థౌ సమీపే పురుషర్షభస్య పార్థస్య పార్థః పృథుదీర్ఘబాహుః
తదన్తరే ధర్మరతో౽పిగత్వా విజ్ఞాయ కున్తీం కుశలీం క్షణేన
ఆగమ్య తస్థౌ సహసోదరాభ్యాం పురుషర్షభాభ్యాం పురుషప్రవీరః"

అని యున్నది.

పూనాలో భండార్కరుసంఘమువారు సుక్తంకరుమహాపండితుని సాయమునఁ బ్రకటించిన యుత్తరదేశపాఠభారతములోఁ జూడఁగా ద్రౌపదీస్వయంవరపర్వములో ననేక భేదములు కనఁబడినవి.

౧౮౯ అధ్యాయము ౧౩ శ్లోకము.

"తస్మింస్తు శబ్దే మహతి ప్రవృత్తే యుధిష్ఠిరో ధర్మభృతాం వరిష్ఠః
ఆవాస మేవో వజగామ శీఘ్రం సార్థం యమాభ్యాం పురుషోత్తమాభ్యామ్"- అని యున్నది.

శ్రీవావిళ్లవారిప్రతిలో 'విజ్ఞాయ కున్తీం కుశలీం క్షణేన ఆగమ్య' అన్నమాటలు పూనాగ్రంథములో నధోజ్ఞాపికలోఁ గూడఁ గనఁబడవు. పూనాప్రతిలో ధర్మరాజు మరలవచ్చినట్లు లేదు. తెనుఁగర్థము వ్రాసిన వారు చెప్పినట్లు "స్వయంవరస్థానమున వారు పూర్వముండిన స్థల మని యర్థము చెప్పుకొనుటకు వీలుకనఁబడదు. తల్లియొద్దికే వెళ్లినట్లు తలంప వలయును.

"అట్టి యవసరంబునఁ దల్లియొద్దకు ధర్మరాజును గవలవారును మున్నవచ్చియున్నఁ దదనంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితులై చను దెంచి" అని 7 వ ఆ. 210 వచనము నన్నయభట్టారకుని దొకటి పిడుగు లాగునఁ గనఁబడుచున్నది. దీనిగతి యేమి !

నన్నయభట్టారకవిలాసము వారు వారిబుద్ధికిఁ దోఁచినట్లు చర్చించుకొని, కథ యేమై పోయినను సరియేగాని నన్నయభట్టుగారు వ్రాసిన భారతములోఁ బ్రసక్తభాగమున నేమైన వాక్యములు పద్యములు నిటీవలఁ బ్రతులు వ్రాసికొనినవారి ప్రమాదమున లోపించిన వేమో యనికొనిరి. కొందఱు చెప్పినట్లు అనుశాసనికపర్వము ప్రక్షిప్తమే కానిండు, కొందఱనునట్లు సౌతి చెప్పినదగ్గఱనుండియే భారతమూలము కానిండు మాకిబ్బంది లేదు, నన్నయభట్టారకుని వాక్యములు లోపించిన మాత్రము సహించియూరకుండ లేమని వారు చెప్పుదురు

'మాత్రాలాభో పుత్రలాభః' అన్నట్లు నన్నయభట్టారకుని ప్రతియొక్కపదమును బంగారమువలెఁ జూచుకొందురు.

ఇపుడిపుడు పలువురు భారత పాఠములలో "అయ్యోడమని" "సీవు విదపడిగుము" "కానతర్క" మొదలగునవి మాపుస్తకములో నిట్లున్నవి, మాపుస్తకములో నిట్లున్న వని తెల్పుచున్నారు. అట్లే యేమహాత్ములప్రతిలోనైన నీలోపములు సవరింపఁబడిన వేమో తెలిసికొందమని యుబలాటపడుచున్నారు. విజ్ఞులీవిషయమును జర్చించి తెల్పఁబ్రార్థించుచున్నారు.

నన్నయభట్టారకుని వాక్యములు కాలగర్భములో నడఁగి పోయిన వేమో యనుభయముచేత నే గాని మూలభారతసందర్భాసందర్భముల ను దెగడుటకుఁ గాని పండితులను బరీక్షించుటకుఁ గాని యీసందేహములను దీర్పుఁ డని కోరుట లేదని భాషాభిమాను లూహింతురు గాక.

---

# వ్యావహారికాంధ్రుల యసంగత ప్రసంగములు.

(గ్రాంథికాంధ్రము మృత మైనదా ?)

---

విమర్శకాగ్రేసరాది బిరుదాంకితు లగు

— బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ —

---

శ్రీమంతం బగు భరతఖండంబున సంస్కృతం బాద్యం బై, యనంతం బై, యఖండం బై, యమృతం బై వెలుంగుచుండఁ దత్సంస్కృత భాష యండఁగాఁ గలిగి యాంధ్రభాష యభివృద్ధినొంది శోభించుచున్న యది. అది బహువిశేషములు గలిగి విరాజిల్లుచున్నది ఇప్పుడు వ్యావహారికాంధ్రుల మని పేరుఁ గొనిన యొక నూతనసంఘమువారు బయలు వెడలి గ్రాంథికాంధ్రమునుగూర్చి విచిత్రప్రసంగములు గావించుచున్నారు. సత్యము తేలఁగలందులకై దానిని గూర్చి ముచ్చటించుకొందము.

"వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజము దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ"

అని ప్రాజ్ఞులు చెప్పుదురు.

ఆంధ్రము గ్రాంథికాంధ్ర మనియు, వ్యావహారికాంధ్ర మనియు, రెండువిధము లనియు, వానిలో గ్రాంథికాంధ్రము మృత మైపోయిన దని వ్రాయుటకును, సమన్వయించుటకును వ్యావహారికాంధ్రులలోఁ బ్రథమగణ్యు లగు రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు సాహసించుచున్నారు. కాని యెప్పుడు మృత మైనదో యెచ్చటను జెప్ప లేదు. అసలీ గ్రాంథికాంధ్ర మెప్పుడు జనన మొందినదో తెలుపలేదు. కాన ముందుగా సాధ్యమైనంతవఱకు దానిఁ గనుఁగొందము.

గ్రాంథికాంధ్రముయొక్క పుట్టుకను గూర్చి "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని నుడివియున్న కృష్ణదేవరాయలవారికి సమీపకాలమం దున్న రామరాజభూషణునిచేఁ దనవసుచరిత్ర యం దిట్లు తెల్పఁబడియున్నది.

మ. మహిమ న్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
త్సహసీయస్థితిమూలమై నిలుప శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింప న్బెంపువాటిల్లు నీ
బహుళాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

దీనిని బట్టి నన్నయభట్టారకునినాఁ డిది సంభవ మైనట్లుగాఁ దేలుచున్నది. మఱియు మిక్కిలి పురాతనకవియే యగు నన్నిచోడమహారాజుకూడ దీసంభవమును గూర్చి కుమారసంభవములో నిట్లు వ్రాసెను.

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెలుం
గును నిల్పి రాంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మున్నగుపలువుర్."

దీనిని బట్టి చూచిన రాజరాజనరేంద్రుని కాలమున—అనఁగా నన్నయభట్టుకాలముననే గ్రంథరచన ప్రారంభ మైన దని తేలుచున్నది. ఇట్లాంధ్రము జన్మించినకాలము మనకు బోధపడుచున్నది. ఇఁక నెప్పుడు మృతి పొందినదో తెలియదు. రామమూర్తిపంతులుగారును నది తెల్పలేదు. మనసారస్వతముం గన నది మృతినొందినట్లు కాన్పింపదు. నన్నయనాఁడు బయలువెడలి యది బహువిధశాఖల విరాజిల్లుచుఁ గ్రమక్రమముగాఁ బెరుఁగుచున్నది. నాఁటినుండియు బహుపురాణములు, నితిహాసములుఁ, బ్రబంధములు, వచనములుఁ, గావ్యములు, వచనకావ్యములు, ద్విపదకావ్యములు, యక్షగానంబులు, దండకములుఁ, గళికోత్కళికలు, శతకములు, నష్టకములు, నీమున్నగునవి బహువిపులముగా బయలువెడలుచున్నవి. శ్రీ రామమూర్తిపంతులుగారు తాము బయలుదేఱినతరువాత గ్రాంథికభాష మృతిపొంది తీరవలయు నని దృఢసంకల్పము చేసికొని నిద్రపోయి

యాన్నిద్రలో వచ్చినకలలో గ్రాంధికాంధ్రము మృతిఁబొంది పోయినట్లు పెద్దస్వప్నముఁ గాంచి రేమో! అట్లు చెప్పుటకును వల్లకాదు. ఏమన వీరితరువాతఁ గూడఁ గళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీకృష్ణభారతము, వావిలికొలను సుబ్బారావుగారియొక్కయు బ్ర. శ్రీ. జనమంచి శేషాద్రిశర్మగారియొక్కయు శ్రీమద్రామాయణములు, నింకనువందలకొలఁది నూతనగ్రంథములును, అనంతపంతుల రామలింగస్వామిగారి శుక్లపక్షము, శ్రీ జయంతి రామయ్యపంతులుగారి ఉత్తరరామచరిత్రము, మాసోదరుఁడగు సాహిత్యవిశారదసుబ్బయ్యశాస్త్రియొక్క సాహిత్యకళ మఱియు నిట్టిగ్రంథరాజము లనేకములును బయలుదేఱుట మనరామమూర్తిపంతులుగారిమనస్సునకు వెగటుగానున్నను గ్రాంథికాంధ్రము మృతిపొందిన దని వ్రాయుట లోకమును మోసపుచ్చుటకై వ్రాసినమోసపువ్రాఁత యని స్పష్టమగుచున్నది.

శ్రీ శ్రీ శ్రీ జయపుర మహారాజావారును శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర మహారాజావారును మఱియు శ్రీమంతు లగుపలువురు సంస్థానాధిపతులును బండితప్రకాండులును దీని నభివృద్ధిఁగావింప విశేషప్రయత్నములు దేశమునం దంతటను గావించుచుండ దీనికిఁ జ్యూతి కలుగు టెట్లు? వెఱ్ఱిసంకల్పములు తమమనస్సులోఁ దాము పెట్టుకొని తమలోఁ దాము సంతసించుచున్నారు మనరావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులుగారు.

అరవము, తెలుఁగు, కన్నడము, మళయాళము మున్నగునవి సోదరదేశభాషలై యుండఁగా సందులో నొక్కతెలుంగునకుమాత్ర మీ శాపము కలుగనేల ?

ఇది యంతయు మన శ్రీ రామమూర్తిపంతులుగారియొక్కయు వారిశిష్యులయొక్కయు గారడీ కాని వేఱు కాదు. ఇందుల కెవరును జంకఁ బనిలేదు. రామమూర్తిపంతులుగారిశిష్యులు కొందఱు గ్రాంథికాంధ్రము మృతమాయె ననుసంగతి కల్ల గాని నిజము కా దని చాటుచున్నారు.

సత్యమేవ జయతి—నానృతమ్

# ఆంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదా ?

(2)

— రామడుగుల వేంకటసుబ్బారావుగారు, విజయనగరము. —

---

పదమధ్యయతులు నన్నయభాగమున లేవనిరి. చూడుడు:—

"సాత్యవతేయవిష్ణుపదసంభవమై విబుధేశ్వరాఢ్యసం
గత్యుపశోభితంబయి జగద్విదితం బగుభారతీయభా
రత్యమరాపగౌఘము నిరంతరసంతతపుణ్యసంపద
న్నిత్యభివృద్ధిసేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్."

ఇట్లు పదమధ్యయతులు నన్నయభాగమునందుఁ బెక్కు లగపడుచుండ లేవని పల్కుట యనాలోచితమని చెప్పవలసియున్నది. సంస్కృతమునఁ బదమధ్యయతి వేసినచో నది యొకదోషముగాఁ బరిగణింతురు, కాని, తెలుఁగున నది శోభాదాయక మగును.

ఆంధ్రభాషకు భాషాశాస్త్రసంప్రదాయము నెఱుంగక, వ్యక్తిత్వవిమర్శ చేయఁబూనుట నాఁగలిలేక వ్యవసాయము చేయుటవంటిదే. వారియుపన్యాసములో గ్రుక్క త్రిప్పుకొనకుండఁ గావ్యములేమి, నాటకములు, అలంకారములు, ఛందస్సులు, గిందస్సులు, సమాసములు, పదములు, తుదకు "ఫుల్‌స్టాపులు" గూడ వచ్చి చేరిన వనుచున్నారు. పదములు చేరిన సమాసములు చేరిన వనుటేల! వాఙ్మయములో ననేకగ్రంథములు తెనిఁగింపఁబడినప్పుడిన్ని యరువుకొన నవసరములేదు. సమస్తము సందఁడియే వచ్చినచోఁ, జిగురుఁగేలు, జుంటిమోవి, యనువానిమాటేమందురు? "సంస్కృతలక్షణంబు దొడరని సమాసంబులుం గల" వను సూరిగారి పంక్తులు శ్రీవారు చూడలేదనుటెట్లు? ఆసంప్రదాయము లన్నియు వచ్చినఁ దెలుఁగులోఁ బ్రత్యయరహితముగా విశేషణవిశేష్యభావము చూపింపఁగలరా? "రామాయ రామభద్రాయ" అనునట్లు తెలుఁగులో రామునికొఱకు రామభద్రునికొఱకు నమస్కార మనుట

విరసముగా నుండును. ఇట్లే యనేకములు భాషాశాస్త్రజ్ఞులకుఁ దెల్లమగుచుండును.

నన్నయకాలమునాఁటికి శుద్ధదేశీయపదములు 4 వేలకుఁ బైఁగా నున్నట్లు కవిత్వవేదిగారు వ్రాసియున్నారు. కనుక నాపదములతో దేశీయ భాషలోఁ గావ్యము సులువుగా రచింపవచ్చును. కాని నన్నయాదులు దేశీయభాషలోఁ గావ్యములను రచింపక తత్సమపదములతో రచించుటకుఁ గారణమేమను సంశయము పొడమువచ్చును. ఆకాలమున సంస్కృతభాష చాల విరివిగాఁ బ్రచారములో నున్నది. పండితాదరణలో నున్నది. కాన, పండితాదరణమును, మెప్పును బొందవలె ననునుద్దేశముతోను, దనసంస్కృతభాషాపాండిత్య ప్రకటనార్థమును, నన్నయ తత్సమపదముల నెక్కుడుగా భారతభాగములోవాడియున్నాఁడు, కాని, యాంధ్రభాషలో దేశీయపదములు తగినన్ని దొరకకను దేశీయభాషలోఁ దాను గావ్యరచన చేయుట కసమర్థుఁడునై తత్సమపదములను వాడి యుండలేదు. కావున నన్నయకాలమునకుండు నాంధ్రభాషలోని యన్యదేశ్యపదములు తీసివేసినను, దేశికావ్యము రచించుటకుఁ దగినంత దేశీయ పదసామగ్రి యాకాలమున లేకపోలేదు.

బ్రహ్మశ్రీ ఆకొండి వేంకటశాస్త్రిగారు సమస్తము సంస్కృతము నుండి తెలుఁగులోనికి వచ్చినట్లు వ్రాసి రని నుడివిరి. వారివ్యాసమునందలి కొన్నివాక్యముల నీక్రింద నుదాహరించుచున్నాను. వానినిబట్టి, శ్రీ వేంకటశాస్త్రిగారే యట్లన్నారో, లేక ప్రతివాదకులే యట్లు దురభిప్రాయపడినారో ప్రాజ్ఞు లూహింతురుగాక. "ద్రావిడభాషలలో నసంఖ్యములగుసంస్కృతప్రాకృత సమపదములును దద్భవపదములు నగుపడుచుండుటచేతను ఆంధ్రవ్యాకరణపురీతులు, సంస్కృతప్రాకృతవ్యాకరణమార్గములే యయి యుండుటచేతను ఆంధ్రభాష సంస్కృతప్రాకృతముల పరిణామ మను నసంగతాభిప్రాయము స్ఫురించుట కవకాశ మొదవె నని తోఁచుచున్నది. ప్రాచీను లగునాంధ్రవైయాకరణు లెవరును, నాంధ్రభాష

సాకల్యముగా, సంస్కృతప్రాకృతములనుండి పుట్టిన దని చెప్పియుండలేదు. ఆంధ్రభాషలోని తత్సమ తద్భవ పదములు సంస్కృతప్రాకృతజన్యము లని మాత్రము చెప్పియున్నారు ''

''వ్యాసభారతమున—దుష్యంతోపాఖ్యానము తరువాత యయాతి చరిత్రమున్నది. ఆంధ్రభారతమున నట్లు గాక, యయాతిచరిత్రము ముందు, దుష్యంతోపాఖ్యానము తరువాత, బ్రాహ్మణాప్సరఃకన్యాజాతసంతతిప్రకాశనపూర్వకము గగౌరవవంశీయుల యాభిజాత్యమును విశదీకరించుటకై నిర్వచింపఁబడినవి. పరీక్షిత్స్వర్గారోహణానంతరమున, జనమేజయురాజ్యాభిషేకసందర్భమున "తతో నృపే తస్మి న్గతే దివం గతే" నృపం శిశుం తస్యసుతం ప్రచక్రిరే" "స బాల ఏ వార్యమతి ర్నృపోత్తమః" అనుమూఁడు శ్లోకములును సౌతి చెప్పినట్లుండ మరల 49వ అధ్యాయములో జనమేజయుఁ డడుగఁగా మంత్రులు పరీక్షిచ్చరితమును దెల్పినట్లు సంస్కృత భారతములో నున్నది. ఈరెంటిని గలిపి చెప్పిన కథనే మరలఁ జెప్పనవసరము లేకుండ మంత్రు లొక్కరే చెప్పిన ట్లాంధ్రభారతమున నున్నది. మూలమున, కీచకుఁ డర్ధరాత్రమునఁ జంపఁబడఁగా నుపకీచకులు మొదలగువా రందఱుఁ దెల్లవాఱిన పిదప వచ్చిచూచి యాతనికి దహనసంస్కారము చేయఁ దలంచి, ద్రౌపదిని గూడ, వానితోఁ దుదముట్టింప నీడ్చుకొని పోయి రనియు, నాప్రాతఃకాలసమయముననె, భీముఁ డుపకీచకులను వధ గావించె ననియు, నుండఁగా, నియ్యది యసంగతముగా నుండుటచే, నుపకీచకుల వధయుఁ దెల్లవాఱుటకుఁబూర్వమే చీకటిలోనే గావించిన ట్లాంధ్రభారతమున మార్పు గావింపఁబడి మూలమునకు వన్నె పెట్టుచున్న ట్లున్నది. కీచకుఁడు ద్రౌపది సౌందర్యమును జూచి యాశ్చర్యపడుచుఁ దద్వర్ణనావసరమున నతిశయోక్తులతోఁ గూడిన భావముల నుత్ప్రేక్షోపమాద్యలంకారాములతోఁ గూర్చి, సమాంతరము లగువాక్యరచన గలపద్యములతోను మూలమున లేని యాంతరంగికశృంగారభావాతిశయములతోను మూలమును మించిన ట్లున్నదాంధ్రభారతము.

ఒకచో నీభాషాంతరీకర్తలు, మూలములోని కథాంశములను వెనుకనున్న దానిని ముందు, ముందున్న దానిని వెనుకగా గ్రహించి కథావస్తువునం దైక్యగుణము సంపాదించుచును మూలమునందలి నీరసపట్టముల నతిరమ్యముగాఁ బ్రదర్శించుచు నవుడు నతికిం భావగర్భితము లగు పదములచేతను నానాకారవర్ణనలచేత నొకదృశ్యమును మనకన్నులయెదుటనడచుచున్న దానినిగాఁ జేయుచును, ఆయాకథాపురుషుల మనోవృత్తులను, భావవైఖరులను వర్ణించుచుఁ బాత్రౌచిత్యమును బాటించి యాకారేంగితాదులను సూచించుచు మూలమునందలి పాత్రలను నూతనజీవముతోఁ బ్రకాశించునట్లు ప్రదర్శించుచును, సందర్భానుసారముగా నూతనము లగుప్రకృతివర్ణనలను జేర్చుచును, మూలమునకు మెఱుఁగు వెట్టుదురు. ఇట్టి సూక్ష్మవిశేషములను, బ్రత్యేకవ్యక్తిత్వమును దెలిసికొనుటకు మూలముతో సరిపోల్చి చూడవలసియుండుటచేతను, గ్రంథవిస్తరభీతిచేతను బైని నాల్గుదాహరణములు మాత్రమే చూపితిని. ఆంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వ మున్న దనుట కాంధ్రమునుండి సంస్కృతములోనికిఁ బరివర్తితము లైనగ్రంథములును, నచ్చతెనుఁగు గ్రంథములును బ్రబలసాక్ష్యములే గదా! రఘునాథనాయకుఁడు రచించిన రామాయణమును మధురవాణి సంస్కృతములోనికిఁ బరివర్తించెను. వసుచరిత్రముకూడ సంస్కృతములోనికిఁ బరివర్తింపఁబడినది. కూచిమంచి తిమ్మనార్యుని యచ్చతెనుఁగుగ్రంథములుకూడ నిందులకు సాక్ష్యములే.

ఆంధ్రభాషాస్వరూపము పూర్తిగఁ దెలిసి యవగాహన చేసికొనియున్నవా రెవ్వరు నాంధ్రవాఙ్మయమునకు వ్యక్తిత్వము లేదని సకారణముగ నిరూపింపఁజాలరు. పక్షపాతదృష్టితోఁ గాక సమదృష్టితోఁ బరిశీలించినచో, నేను బైని నిరూపించినవానివలన, నాంధ్రవాఙ్మయమునకు సంపూర్ణమైన వ్యక్తిత్వము కల దని తెలియు నని నాయభిప్రాయము.

శ్రీరస్తు.

# సుమతిశతకపద్యములు.

---

క. క్షితిఁ గానికూడుఁ గుడువకు
సతి నమ్మి రహస్యవిధులు సలుపకు మెపుడుం
బతిలేని యింట నుండకు
మతిమంతుల కిదియె నీతిమార్గము సుమతీ. ౧

క. పగవాఁడు తనకుఁ జిక్కినఁ
బగఁ జంపక మేలుచేసి పంపుట ధరలోఁ
బగవాని కదియె చంపుట
తగుఁజనికి నిదియె నీతి తథ్యము సుమతీ. ౨

క. కుటిలునితో నొనఁ గూడకు
కటువగు సభలోన వెడలఁ బల్కకు మది దు
ర్ఘటమగు కార్యము చేయకు
నిటలాక్షుని మీఁదిభక్తి నిలుపుము సుమతీ. ౩

క. వినయము కంఠాభరణము
ఘనమగుదానంబు నధికకరభూషణముల్
విను కర్ణాభరణంబుగ
వినవలె శివకథల నెపుడు వేడుక సుమతీ. ౪

క. కాదన్నవాఁడె కరణము
వాదణఁచినవాఁడె రెడ్డి వసుధేశుఁకున్
లేదన్నవాఁడె చనవరి
గాథలు పెక్కాడువాఁడె కావ్యుఁడు సుమతీ. ౫

క. ఇంపెఱుఁగని సతిఁ గోరుట
కంపలరనిపూవు ముడువఁ గైకొనుటెల్లం
బెంపెఱుఁగని నృపుఁ గొల్చుట
సంపెంగకుఁ దుమ్మెదేఁగి చచ్చుట సుమతీ. ౬

క. నెనరుగలవాఁడె చుట్టము
తనమనసుకు వచ్చువాఁడె దాత ధరిత్రిన్
కనుమఱుఁగుకలదె యాఁడుది
తనవాఁ డొరులనెడుమాట తథ్యము సుమతీ. ౭

క. స్థితిలేక బల్మిచెల్లదు
స్థితిగల్గిన బల్మి లేక స్థితిచెల్లదు నా
స్థితియును బల్మియుఁ గల్గిన
సతనిది త్రైలోక్యపదవి యందురు సుమతీ. ౮

క. రిపుపౌత్త్రుఁ బాముపౌత్త్రును
గపటుండగు మిత్త్రుపౌత్త్రు గడుసరిపౌత్త్రున్
విపరీతభార్యపౌత్త్రుదు
నెపమున విడనాడకున్న నేరము సుమతీ. ౯

క. మాతంగము మదమెక్కిన
భూతలపతి జారుఁడైన భువి విద్వాంసుల్
పాతకులైనను సాగర
భూతంబులు చేరుట్లు భువిలో సుమతీ. ౧౦

క. కనరానిది చల మైనను
వినరానిది గురులనింద వినుకలియైనన్
అనరానిది తలిదండ్రుల
మనరా దవివేకితోడ మతమిది సుమతీ. ౧౧

క. తెరువున నేనుఁగుఁ బోడఁగని
మొరయించుక వెట్టిగంపు మొఱఁగిరభంగిన్
దొర సల్పుఁ డెఱుఁగ కాడిన
సరిసేయఁగవలచు వానిసహాజము సుమతీ. ౧౨

క. తమకించిన నెపమెంచును
దమకించినఁ దల్లియైనఁ దనుఁజెఱఁ జూచున్
దమకింపఁ గార్యహానియుఁ
దమకించినఁ బ్రాణహాని తప్పదు సుమతీ. ౧౩

క. ఎన్నఁడుఁ గుడువక కట్టక
తన్నెఱి కూర్చుధనము ధరలో నెపుడున్
అన్నులకు రాజులకు వఱి
కన్నములకుఁ బోవుచుండుఁ గదరా సుమతీ. ౧౪

క. చపలత లాభముఁ జెఱచును
నెపమునఁ బగవారిఁగూడి నేరములెంచున్
అపలాపించును నమ్మిక
కపటాత్ములతోడిపొందు కాదుర సుమతీ. ౧౫

క. హరినైన జిష్ణునైనను
సురపతిసుతునైనఁ జంద్రసూర్యులనైనన్
సురకాని వ్యయముసేయక
తిరుణులు డాయంగనీరు తథ్యము సుమతీ. ౧౬

క. భూమీశుచిత్త మెఱుఁగక
ప్రేమముతో మనవిచెప్పఁ బెనఁగుటలెల్లం
బాముకు వాకట్టెఱుఁగక
సామునఁ జెఱుచాఁచునట్టిచందము సుమతీ. ౧౭

క. నగజాతకు హరుమేనను
సగపాలిప్పించె మరుఁడు చచ్చిఁ పిదపం
బగసాధింపనిమనుజుఁడు
మగవాఁడా! మగువగాక మహిలో సుమతీ. ౧౮

క. ఎడ్డెఁడు సతిపలపెఱుఁగఁడు
జడ్డిలఁబడితిరుగువాఁడు జాణం డగునా
యడ్డమునిఁ పుడు దిరిగెడు
ఱెడ్డెఱుఁగునె పాల తీపిఁ దెల్లము సుమతీ. ౧౯

క. అరమాడ జీతమైనను
ధరణీశుఁడు తగవరైన దగ్గఱవచ్చున్
సురరాజ్య మిచ్చెనేనియుఁ
దరమెఱుఁగనిరాజుఁ గొల్వఁ దగదుర సుమతీ. ౨౦

క. బలువిద్య లెన్నిగలిగినఁ
గులవిద్యయె వన్నెఁ దెచ్చుఁ గొంకక ధరలో
విలువిద్య పరశురాముని
కులవిద్యయె? యెన్నిచూడ కొంచెఁగా సుమతీ. ౨౧

క. దీపము మలిగినఁ జీకటి
యేపునఁ గానంగవచ్చి హెచ్చినకగిదిన్
శ్రీపొలఁతి వాసినప్పుడె
యాపద లానరునిమేం నలమురు సుమతీ. ౨౨

క. పులినాకి విడుచు దైవము
గలకాలము; దైవరహితకాలం బైనం
గలుపించి గొఱ్ఱెఁగఱచును
దలపోయఁగ దైవవశము తప్పదు సుమతీ. ౨౩

క. తప్పునకుఁ దగినదండన
మప్పుడె సేయంగవలయు నవనీశునకున్
నిప్పునను జీరఁజుట్టిన
యప్పగిదినిఁ జేయవలయు నాతని సుమతీ. ౨౪

క. కలిమియె కులమున కధికము
కలిమియె బలవర్ధనంబు కలిమియె మిగులుం
గలిమియె యుక్తికి మూలము
కలిమియె సుఖకరము తలఁపఁగా నిల సుమతీ. ౨౫

క. సత్య మఖిలజనపూజ్యము
సత్యమె సురలోకసౌఖ్యసోపానం బౌ
సత్యమె నిశ్చల ధర్మము
సత్యమె భవహరము జయము సత్యమె సుమతీ. ౨౬

క. బలవంతుఁడె గుణవంతుఁడు
బలవంతున కాజ్ఞచెల్లు బలవంతునకే
కలిమి గలవారె బఁతురు
బలవంతుం డఖిలమునకు బలమగు సుమతీ. ౨౭

క. ఆయంబు వ్యయము మించిన
శ్రీయును సమమైన దశము చెడకుండు వ్యయం
బాయంబు మించెనేనియుఁ
బాయదు పేదఱిక మెన్ని భంగుల సుమతీ. ౨౮

క. గుప్తము సేయుము తంత్రము
సప్తోపాయములనైన శత్రుల గెలువా
సప్తవ్యసనము లుడిగియు
నాప్తుల రక్షింపు చాలు సంతియె సుమతీ. ౨౯

క. రాఁగలభాగ్యము వచ్చినఁ
దాఁ గుడువక దాన మిడక దాఁపఁగ నేలా
పోఁగాలంబులు వచ్చిన
మాఁగిన పండ్లూడినట్లు మహిలో సుమతీ. 3౦

క. గాడిద మదకరి యగునే
బూడిద కర్పూరరజము పోలికి యగునే
మోడు విమానం బగునే
మూర్ఖుఁడు గుణియగునె తలఁప ముమ్మాఁగ సుమతీ. 3౧

క. ఇచ్చినదినముల దాఁకనె
లచ్చికి నెడఁ బాయరాదు లజ్జయు వలెనే
యిచ్చినదినములు తీఱిన
నిచ్చఁ దనుం బాసి లచ్చి యేఁగుర సుమతీ. 3౨

క. తనయుఁడు తండ్రికి బాలుఁడు
ఘనుఁ డాతఁడు తండ్రి లావుగలవాఁ డెల్లన్
జనకునిలా వుడిగిన మఱి
తనయునికిని దండ్రి శిశువు ధరలో సుమతీ. 33

క. రానిది కోరిన వచ్చునె
రానున్నది కోరకున్న రాకేలుండున్
దానెంత తమకపడినను
గానున్నది గాకపోదు గదరా సుమతీ. 3౪

క. అంజనసూనుఁడు దెచ్చిన
సంజీవికి సాటివచ్చు సకలార్థులకున్
రంజిల్ల నపుడు వార్చిన
గంజిసుమీ ప్రాణరక్ష గదరా సుమతీ. ౩౫

క. దారిద్ర్యముకంటె మహా
దారుణ మగు పాతకములు తలఁప౦ గలవే
చేరుదురు మృతిని నలువురుఁ
జేరనొకో దరిద్రు నొకఁడు సిద్ధము సుమతీ. ౩౬

క. అలుకునెడ రొంపిఁ జల్లుట
కొలుచొల్లమిగాదు మిగులఁ గూర్చుటకొఱకే
వలయునెడ నర్థమిచ్చుట
వెలయఁగ నభివృద్ధికొఱకె వినురా సుమతీ ౩౭

క. ఏడెన్నెలుఁగఁగవలయును
నేడెన్నఁడు విడువవలవ దేడున్ విడుమీ
యేడున్ మనమున నిలుపుము
యేడెన్నఁడు విశ్వసింప కెన్నఁగ సుమతీ. ౩౮

క. అనఘా విను ముద్యోగికి
ధనమొండెను గీర్తి యొండె ధన్యత యొండెం
బొనరంగ నిరుద్యోగికి
ధనకీర్తులు రెండు లేవు తథ్యము సుమతీ. ౩౯

క. మదిఁ బొడమిన దుఃఖమునకుఁ
జను వొండెనుఁ బ్రాయ మొండె సజ్జనగోష్ఠిం
బొదలుచు నొకపద మొండెను
బద నెఱిఁగిన చెల్మియొండెఁ బ్రాణము సుమతీ. ౪౦

క. ఆసించినవ్వా డిచ్చిన
పీసము పదివేలుపోలు వెయివేలైనన్
వీసముగఁ జూజు మనుజుం
డాసల నడియాడ నీయ నర్థికి సుమతీ. ౪౧

క. ఒఱగొడ్డె పూరనుండకు
మఱగలచుట్టంబు కలిమి కాసింపకు మిం
పెఱుఁగని హీనునిఁ గొల్వకు
మెఱవక దుర్జనుల గోష్ఠి మానుము సుమతీ. ౪౨

క. భువి నీవి కొంచె మైనను
గువలయపతి సుగుణియైనఁ గొల్వఁగవచ్చున్
యువరాజ్యపట్టమిచ్చిన
నవివేకిని గొల్చుటెల్ల నధమము సుమతీ. ౪౩

క. త్రాసును ధరలోఁ బడిచెడు
పీసనబడి కొక్కిరాపు వివరింపంగా
పీసంబైనను దిరముగ
నోసరముగ నొక్కపుంక నొడఁగుర సుమతీ. ౪౪

క. వలవని పల్లను మదిలోఁ
గలయని సతిపొందు రాజుగానని కొలువుం
బిలువని పేరంటంబును
దలఁపని చెలిమియును నొంచఁ దగదుర సుమతీ. ౪౫

క. ఘన మెఱుఁగనట్టి కోడలు
వినయము లేనట్టి సుతుఁడు వెఱవని యనుజుల్
అనుకూల గానిభార్యయు
మనుజునకును మందు లేనిమరణము సుమతీ. ౪౬

క. తెలిమినఁ బాఱనిగుఱ్ఱముఁ
దరమెఱుఁగని రాజుకొలువు తరుణులవెతలం
దరిలీపు సేయు మోహము
గరగరగా విడువవలయుఁ గదరా సుమతీ. ౪౭

క. సుంకరికి బొంకు వలయును
అంకనకును దిరుగవలయు నవనీస్థలిలో
శంకుడిగి మిగుల ముదిసిన
వంకాయకుఁ జింతపండు వలెరా సుమతీ.

క. సిరి తనకు వలచి వచ్చిన
సిరికిం దగు చిహ్నాలెల్లఁ జేయఁగవలదా
సిరిగూర్చి ప్రాఁకఁ దలఁచిన
సిరికడపటఁ జేరు నదియు సిద్ధము సుమతీ. ౪౯

క. మొగసాల నొంటి నుండకు
పగచాటి జయించు దాఁకఁ బదరకు మదిలోఁ
దెగఁబాఱువాని నమ్మకు
పగగొనునాచోట నిల్వ వలదుర సుమతీ. ౫౦

---

ఇవి, అంద్రంగి గ్రామనివాసులు బొడ్డపాటి లక్ష్మీపతిగారిచే క్రీ శ. ౧౮౬౩ సంవత్సరమున వ్రాసికొనఁబడిన తాళపత్ర సుమతిశతకపద్యము లనుండి శ్రీ దుప్పూరి బావన్నగా రెత్తి వ్రాసి పంపినవి.

కొన్ని పద్యము లింకను గలవుగాని మృదువుతప్పియున్నవి. ప్రకటించిన వానిలోను గొన్ని సందేహములుగా నున్నవి.

అచ్చుపడిన పుస్తకములలో నివి కనఁబడవు.

# వ్యాకరణశాస్త్ర ప్రశంస.

— శ్రీ. భా. ప్ర. మల్లాది సత్యనారాయణశాస్త్రిగారు, నూజివీడు —

---

వ్యాకరణశాస్త్ర మనఁగా నాయాపదముల కాయాయర్థము లెట్లు సరిపడినవో, యాయాపదములలో నాశాస్త్రజ్ఞులు పారిభాషికములుగ నేయేయవయవము లున్నవని యంగీకరించిరో యందుఁ బ్రకృతిప్రత్యయము లని వేఱుచేసిరో వానిలో నొక్కొక్కదాని కెంతెంత యర్థమో సమిష్టివలనఁ గలుగునర్థ మెట్టిదో మొదలగునంశములను విమర్శించి నిర్ణయము చేయు నియమన మని యాపేరును బట్టి నిర్ణయింపనగును. (వ్యాకరణ=విశేషముగా (శబ్దములలో) నవయవులయు, నవయవములయు విభజనమును జేయు, శాస్త్రము=శాసనములు-అని వ్యుత్పత్తి)-ఈశాసన మిక్కడొకరు చేసినట్లు కానిపించుచున్నదే గాని విచారింప నది స్వతస్సిద్ధమే యని తేలఁగలదు.

లోకములోని పదార్థములను మనుష్యులు తమయనుభవమునకుఁ దగినట్లుపయోగపఱచుట యరయుచున్నాము. కాని వాఁడాపదార్థములోని ప్రత్యంశమును దెలియఁజాలకున్నవాఁడు. పదార్థవిజ్ఞానశాస్త్రవేత్త మాత్ర మాపదార్థములో నెన్నియంశము లున్నవో యాదేయంశ మెందుల కుపయోగపడునో మొదలగు నంశములను విమర్శించి యీకారణముచే నీవస్తువును జను లిట్టియుపయోగములో నుంచిరని నిర్ణయము చేయఁగలఁడు. సామాన్యమానవునకును శాస్త్రవేత్తకును గలభేద మిట్లే యనంతమై యున్నది. ఆశాస్త్రవేత్త కట్టివిజ్ఞానము మొదట లేకపోయినను విమర్శించుస్వభావముగలిగి విమర్శించుచుండుటచే నలవడుచున్నది. అట్టి యనుభూతవిషయవిమర్శకులు స్థూలదృష్టితోఁ జూచి కొంతజ్ఞానము సూక్ష్మదృష్టితోఁ జూచి కొంతజ్ఞానము నుపార్జించి విజ్ఞానవంతు లగుచున్నారు. ఇట్టి విజ్ఞాతలు చేయునుపదేశములవలనను స్వయముగా విమర్శించు స్వభావము గలవారగుటవలనను గ్రొత్తవిమర్శకులు లోఁతునకు బు

ద్ధిని జొరనిచ్చి యందలి క్రొత్తయంశములను వెల్లడిచేయును. ఇట్లు చేయుటచేత విజ్ఞానము ఒక గ్రంథరూపమును దాల్చి శాస్త్రమను పేర వెలయుచున్నది.

ఆశాస్త్ర మభ్యసింపఁదలచినవాఁడు శాస్త్రజ్ఞుఁడు చెప్పునంశములను దెలిసికొనలేక మాటిమాటికి విసుగుఁగొనుట విద్యార్థులతోఁ బరిచయము గల యాగురువులకు ననుభవగోచరమే. అవిధముగనే వ్యాకరణశాస్త్రముకూడ నభిప్రాయబోధకశబ్దప్రయోగములలోఁ బుట్టి యావిషయ మెఱుఁగువాఁడు వచ్చుపర్యంత మణఁగియుండి యావిమర్శకునివలనఁ దల యెత్తి క్రమముగా శాఖోపశాఖల విరాజిల్లు మహావృక్షమువలెఁ బ్రకృతిప్రత్యయాద్యనంతవిశేషములు గలదై చూచువారికి భయంకరము నాశ్చర్యకరము నై యుండును. పదార్థవిజ్ఞానశాస్త్రమట్లు లీవ్యాకరణశాస్త్రమును సామాన్యమానవుల కగోచరమే.

కనుక భాషతోడనే పుట్టి భాషతోడనే పెరిఁగి భాషతోడఁ గలసిమెలసి యున్న వ్యాకరణము క్రొత్తవిషయము గాదు. కనుకనే వైయాకరణు లఖండస్ఫోటవాదు లైరి.

ఆవ్యాకర్త యాశాస్త్రమును గనుఁగొనెనే కాని భాషకుఁ జేసిన మహాహాని యేమియును లేదు. శాస్త్రకర్తకు శాస్త్రరచనయందలి యుద్దేశ్యము సాధకుఁడు సులభముగా నావిషయమును గ్రహించియుండవలె ననియే గాని బాధపడవలె నని కాదు. అయిన నంతయధికవిషయమును సులభముగ గ్రహింపఁజేయవలె నను నుద్దేశ్యముతో నాశాస్త్ర మారంభించెను గానఁ గష్టముగా నుండకమానదు.

అనఁగా మానసికపరిశ్రమముకంటె శారీరకపరిశ్రమము కష్టమని తలఁచి మానసికపరిశ్రమముగఁ జెప్పఁబూనినయంశమును గొన్నిశబ్దములతోనే చెప్పఁదలంచినందునఁ గష్టమని యభిప్రాయము. అందును బ్రారంభమునఁ జెప్ప నలవి కాని యంతకష్టము. వే యేల "కష్టం శాస్త్ర మ్మ"ను సూత్రమే కలదు. ఆకష్టమునకుఁ దాళినవానిబుద్ధి కావిషయ మంతయు సులభమై పోవును.

కాన వాఁడు శబ్దస్వరూపనిర్ణయముఁ జక్కఁగాఁ జేయఁగలవాఁడగును. అది యేవానికి నుపయోగము. అంతగొప్పవిషయము నన్ని కొద్దిపదములతోఁ జెప్పఁజాలనిమొదల నాశాస్త్రము నప్రయోజన మనవచ్చును. భాషనంతను బరిపూర్ణముగా నేర్చి యాయాప్రయోగవిశేషములను జక్కఁగాఁ బ్రయోగింప నభ్యసించినవారికి నీశాస్త్రమువలనఁ గలుగులాభ మేమి? అది సులభముగా సాధ్యము గా దనియే శాస్త్రమును దానిపైపు మాపును బ్రసరింపఁజేయుట తటస్థించినది. ఇందులకనియే పతంజలిముని బృహస్పతియొక్క యింద్రునకు శబ్దములచే కొన్ని వేలేండ్లు నేర్పెనని యితిహాసము నుపన్యసించెను. కనుక శాస్త్రము మహాప్రయోజనవంతమని తేలినది. అట్టిశాస్త్రము జనులవ్యవహారమునుండియే బయలుదేఱను గాని పనిలేనివాఁడు కాలక్షేపమునకై సృష్టించి ప్రజలపై వేసినశాస్త్రము గాదు. ఆశాస్త్రకర్తను గేవలప్రకాశకుఁ డనియే కాని యుత్పాదకుఁడనను వరాదు. ఆశాస్త్రవేత్తలును శాస్త్రములును లేనిచో నాభాష వ్యవహారైకశరణ్యై శబ్దశాస్త్రవకమై యుండును, గాన, నప్పుడు ప్రయోక్తల యవయవలోపాదికమువలన వచ్చునుచ్చారణములు నానావిధములై యుండి క్రమముగా బలిసి బలిసి యొక యానుపూర్వి గలశబ్దము నైనను శీఘ్రముగా భిన్నానుపూర్విగలశబ్దమునుగా మార్చుచుండును. అంతియే కాదు, పూర్వప్రయోగములు ముందుముందు కాలమునకు నప్పటివి తరువాతికాలమునకు నిలువక యెప్పటికప్పుడు క్రొత్తవియై యుండును, గాన, నాభాష చిరకాలముక్రిందట నుత్పన్నమైనను వెదకికొనఁ దగినశబ్దములు గలదై పోవును. ఆభాష యేదైనగ్రంథరూపమున నున్నచో శాశ్వతముగా నిలుచును గాని కాలము గడచినకొలఁదిఁ దద్వేత్తలు దుర్లభులు గాన నందలియుందములు నర్థములును దెలియఁబడవు. కనుకనే ఋగ్వేదభాష క్షాత్సానులకుఁ దెలియకుండుట తటస్థించినది.

శాస్త్రవేత్త లున్నచో నాయాప్రయోగముల నన్నింటిని గొన్నిసూత్రములచేతనే గుదిగ్రుచ్చి యుండుట, వానికి విపులముగ వ్యాఖ్యానము వ్రాయుట వాని ననుసరించి కొన్నికావ్యాదిగ్రంథములఁ జేయుట మొద

లగునవి కాకని గాన్పఁ బూర్వప్రయోగములు ఫలములు గాక తెలి మాఁబడునర్థములు గల్గియుండును. అదియే శాస్త్రమునకు వినియోగము. ఆకారణముచే భాష సృష్టి యగుచు గాక క్షీణించును. కేవలవ్యవహారమునకు నివి యన్నియు నక్కఱ లేదు. కావున నీప్రయోగవిశేషముల నెఱింగి ప్రయోగించినవారు గ్రాంథికులగుదురు, వెఱలు వ్యావహారికులు నగుదురు. ఇట్లు గ్రాంథికవ్యావహారికత్వరూపవ్యవహారభేదము ప్రాదుర్భవించి బలియుచుండును. క్రమముగా నాభేదముబలిసి యాగ్రాంథికవ్యావహారికభాషల నొకదానికొకటి చూపుమేరదూరమున నున్నట్లుచేయును. అయినను గ్రాంథికవ్యావహారికు లొక్కచోట నున్నందునను వ్యవహారము ప్రబలమైనదగుటచేతను గ్రాంథికులకుఁ గూడ నప్పుడప్పుడు వ్యవహారశిష్టపదములు భాషలో దొరలకపోవు; గ్రంథములలోఁ జొరకను పోవు. అదికారణముగా శాస్త్రము వ్యర్థప్రయోజన మనవచ్చునా ?

ఏవ్యావహారికభాషకు నైన నేదో యొకకట్టుపాటు స్వతస్సిద్ధమై యుండనే యుండును. ఆకట్టుపాటులేనిచో నాభాష యర్థమగుట యెట్లు? కొంతకాలమునకు దానికిఁగూడఁ బ్రకాశకుఁడు బయలుదేఱనే తేఱును. ఏగ్రాంథికభాషయైన మొదట వ్యావహారికభాషగానే యుండియుండును. ఇప్పటి వ్యావహారికభాషకువలెనే (త్రిలింగభాషకువలెనే) యప్పటివ్యావహారికభాషలకుఁ(వైదికలౌకికసంస్కృతభాషలకు) గూడ మొదట వ్యాకరణనియమములు వ్రాయఁబడి యుండనే యుండవు. కనుకనే కౌత్సుఁడను ఋషి వేదమున కర్థము లేదనియు దానివిమర్శనము శుష్కప్రయోజన మనియును నిందింప యాస్కఋషి నిరుక్తనిఘంటువును జేసి సమర్థించుకొనవలసిన యవసరము గలవాఁడాయెను. గీర్వాణభాషకుఁగూడ వ్యాకరణము వ్రాయునవసరము ప్రాకృతభాష వ్యావహారికభాషగా నుండినప్పుడే గాని ముందుగాఁ గాదు. ఏకొందఱి వ్యవహారములో నైన నున్నంగాని భాష గ్రాంథికత్వ మందదు. అప్పుడు గాని దానికి నియమములు గనిపెట్టుట వ్రాయుట సంభవించవు. లోకములో నర్థము ప్రాప్తించఁగాఁ దత్ప్రతీకారము నరయుటవలె గ్రాంథికభాషలో వ్యవహారబలము

చే మార్పులువచ్చుచుండఁ దత్ప్రతిక్రియ నరయుట యుండును గాని ముందుగాఁ గాదు. ఇప్పటివ్యావహారికభాషకు (తెలుఁగుభాషకు) నొకటి గ్రాంథికభాషతో (ఆంధ్రభాషతో) సంబంధము లేకుండ వ్యాకరణనియమములను వ్రాసికొనవచ్చును గాని యట్లు శాస్త్రమును బెంచి చేయఁదగిన దేమో తెలియదు. శాస్త్రమున కుపయోగము సులభముగను నిర్దుష్టముగను భాష నలవడఁజేసికొనుటయే కాని యూరక ప్రయాసమునకుఁ గాదు. దీనివిషయమై పతంజలిమహాముని "రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్" అని నుడివియే యున్నారు. ఈప్రయోజనములు వేదమునకు సంబంధించినవియే కాని సందర్భమును బరిశీలించినచో నన్ని గ్రాంథికములకు నుపయోగించు నని తెలియఁగలదు. గ్రాంథికమైన వేదభాషకూడ నొకప్పుడు వ్యావహారికభాషయే యై తీరవలెఁ గాన దాని తరువాతి దగు సంస్కృతభాష వ్యావహారికభాషగా నుండినప్పుడు గ్రాంథికభాషాప్రయోగములను రక్షించుట మొదలగునంశములు సార్థకమైనట్లు ప్రస్తుతవ్యావహారిక త్రిలింగభాషాకాలమునఁ గూడ గ్రాంథికాంధ్రభాషారక్షణాదికము సార్థకముకాకపోదు. భాష యని పేరు వచ్చుటకు జనులవ్యవహారము కారణము గాన వైదికభాష కూడ నొకప్పుడు వ్యావహారికభాషయే యని నిర్ధరింపఁబడినది.

మఱియు నీవ్యావహారికభాష ప్రస్తుత వ్యవహారములో నున్నందున నందలి ప్రయోగములు వానినియమములును మఱుఁగుపడుటకు వలనుపడవు. గ్రాంథికభాషాప్రయోగములును వానినియమములును గ్రంథైకదృష్టములు గనుక మఱుఁగుపడుట కవకాశము చాలఁ గలదు. కనుక గ్రాంథికభాషకు నియమప్రకాశన మెట్లవసరమో యట్లు వ్యావహారికభాష కవసరము గాదు. లాభములేని పని కెవ్వఁడు ప్రయత్నింపఁడు గదా!

మఱియు నే భాషకైన వ్యాకరణప్రయోజనము నేకొంచెమునైనఁ జూచి యుండి గదా వ్యాకరణశాస్త్రమును దానిని గనుఁగొన యత్నించుట. ఎప్పటికప్పు డుచ్చారణభేదముచే మార్పు చెందు నీవ్యావహా

రికభాషకు నియమములను వ్రాయసమకట్టుట యీభాషాభ్యాసకులకు నుపద్రవము చేయుటయు కాని సాయము చేయుట కాదు. ప్రయోగరత్నాది ప్రయోజనములు వ్యావహారికభాషకు నుండనేయుండవు. మఱి వఱబడిన దానిని గదా శాస్త్రకర్త జ్ఞాపనము చేయుట. అది వ్యవహారమునం దున్నభాషావిషయమై యెన్నఁడు నవసరము కాదు. కనుక వ్యావహారికభాషకు వ్యాకరణనియమములను వ్రాయఁబూనుట వృథాప్రయాసకారణము. ఈహేతువుచేతఁ గవులు వేఱనియు శాస్త్రకర్తలు వేఱనియుఁ దలఁచి కవి తనయిష్టమువచ్చినట్లు గ్రాంథికవ్యావహారిక భాషాపదములను గలిపి యుపయోగించుకొనవచ్చును. "ప్రయోగైకశరణా వైయాకరణా" యనునభియుక్తోక్తి గలదు గదా. కనుక నాతని ప్రయోగము లెట్లున్నను వానిది దోషము కాదు. వాని నన్నింటిని మేనమామయస్థులవలె మొత్తముచేసి దాఁచి యుంచుకొనవలసిన "పూచీ" శాస్త్రకర్తది కాని కవి కేమియు లేదు-అని చెప్పనుఁ గావలసినచో వ్యావహారికభాషకుఁ గూడ వ్యాకరణము వ్రాసికొనుఁడని వ్యాకర్తలపై నా భారమును వేయుట యెంతటిహాస్యప్రసంగమో యెంతటి శుష్కవాదమో శిక్షితవిద్యు లూహించెదరుగాక! మఱియుఁ బైనిఁ జెప్పఁబడిన భారమును బండితులపైఁ వేయఁదలఁచిన వారియుద్దేశ్యము ప్రకారము పండితుఁడు కొఱవిచేఁ దలఁగోఁకికొనఁ దలఁచినవాఁ డని యెంచఁదగును. అందఱవలె నతఁడు నేదో యొకకథలపుస్తకమును వ్రాసి యిహపరములయందు సుఖములేక శాస్త్రాభ్యాసమున కని కొన్నియేండ్లు భాషాభ్యాసనమున కని కొన్నియేండ్లు శ్రమపడి చివరకుఁ బొందఁదగినఫల మేమియు లేక యిట్టి వారినిందల పాలగుట యేన్యాయమతమునఁ గలదా? అందు శాస్త్రము గనుఁగొనిన వానిది తప్పా? యభ్యసించినవానిది తప్పా? కనుక ని వాదము గట్టిపెట్టి పెద్దవారిమతము ననుసరింతము.

మనుష్యసృష్టికిఁ బ్రారంభమున నొకప్రదేశమునందు నొకస్త్రీపురుషుల జత యైన నుండియుండును. ఆదంపతులు గాని వారిసంతతివారు గాని తమయభిప్రాయమును బరస్పరము బోధించుకొనుటకు నేదో యొక

శబ్దరూపసాధనమును (అఖండవాక్యమును) దప్పక యుపయోగించుకొ
ని యుందురు. ఆసాధనములో నప్పుడు తెలియఁబడకపోయిన యవయవ
ములను పేరఁ బరఁగు శబ్దము లనేకము లుండియుండును. ఆశబ్దములకుఁ
గూడఁ గర్తృకర్మక్రియాత్వాది ధర్మములు స్వరూపభేదము గలిగియుఁ
బ్రయోక్తలచేఁ దెలియఁబడకయే యుండును. పరస్పరము వారు పలుకు
పదములు సాధారణముగా నొకతీరుననే యుండును. అనఁగా నప్పుడు
కూడ నభిప్రాయబోధకశబ్దరూపసాధనమున నొక యర్థముగల యేయా
నుపూర్వికి నేయేవిశేషార్థములు గలుగవలె నని యుద్దేశించి వక్త ప్ర
యోగించుచున్నాఁడో యాయానుపూర్వికే యాయావిశేషార్థములే
గలుగవలె నని యాశ్రోత కూడ వక్త యైన మఱియొకప్పుడు ప్రయోగిం
చుచున్నాఁ డని తాత్పర్యము.

ఆసాధనము దుష్టమగుటకు నాతరువాతివారి కేరికిని నోరాడ
దు గదా! దానినే తప్పువారికి లోకమునఁ దప్పనరానిది యుండనే
యుండదు. ఆసాధనముతో వ్యవహరించువారి కుటుంబము పెరిఁగినకొ
లఁది నాయభిప్రాయబోధకశబ్దరూపసాధనముకూడఁ బెరిఁగియే యుండు
ను. అనఁగా వస్తువిశేషవాచకములే గాక యాయాపదములలో వర్ణ
లోపాదులు గలిగి పర్యాయాదిపదములు గా మాఱి భాష పెరుఁగు
నని యర్థము; ఆసాధనసామగ్రిని సాంగోపాంగముగ వినియోగించువాఁడు
బయలుదేఱువఱకు నం దవయవావయవులభేదము దురూహ్యము. ఆ
కాలమందుఁ గూడ నేకొంచెముగానో జీవనోపాధి భేదమును బట్టియు
నుపదేశశ్రద్ధాదులఁ బట్టియు శబ్దోచ్చారణసాధనావయవముల సౌష్ఠవము
ను బట్టియు నైకైకశబ్దోచ్చారణము నిపుణమైనకూడ జనులలో నుత్తమ
మధ్యమాధమభేదము కలుగకమానదు. కలిగినభేదమాత్రముగా బలిసి
యాశబ్దమునకు రూపాంతరము నాపాదింపకపోదు. అప్పు డది పర్యా
యాదిపదములుగా నుండి వ్యవహరింపఁబడును. మఱియును, బొత్తిగ
రూపము మాఱిపోయినచోను బూర్వప్రయోగములను దరువాతి
సామాన్య మానవులు తెలిసికొనలేక పోయినచోను మొదటి

రూపమునకును రెండవరూపమునకును సాధారణనియమము కుదురక పోయినచోను నారెండు రూపములకు రెండుభాష లని వ్యవహారము రాక మానదు. ఆవ్యవహారము మొదట గ్రాంథికవ్యావహారికత్వములతో మొకలిడి పోనుఁబోను దృఢపడిపోవును. శిక్షితవిద్యులు వ్యవహరించుపదజాలము గ్రాంథికముకాన నందు నేకట్టుపాటును వారు గ్రహింపఁగలిగిరో యదియే వ్యాకరణ మని చెప్పఁబడును. అది యాభాషాసహజమ్ము గాని దేశాంతరమునుండి దిగుమతి యైనది గాదు. కనుక మనుష్యులతో వ్యవహారము దానితో భాష యద్దానితో గ్రాంథికవ్యావహారికత్వములు వానితో వ్యాకరణము నిట్లివి సూదితో దారమువలె నొకదాని నొకటి వీడక కలసిమెలసి యున్నవే కాని భేద్యములును బహిహార్యములును గావు.

కనుక భాష ముందు పుట్టినదా? వ్యాకరణము ముందు పుట్టినదా? యనువ్యాకరణదూషణపరవికటప్రశ్న పరంపరలను వదలివేయుట సర్వరమణీయము. మఱియు నీగ్రాంథికవ్యావహారికత్వములు వ్యర్థధర్మము లని పట్టుదలతో నందు రేని యొకభాషాకుటుంబములోని వని చెప్పఁబడు రెండుభాషలు మొదట నెట్లుండినవి? అవి యట్లు చీలిపోవుటకుఁ గారణము మొదటినుండి ప్రజలయుచ్చారణభేదము గాక మఱే మని చెప్పఁదగును. దీనికి భాషాంతరసంపర్కమే కారణ మని నిర్ధారణ యుండునా? ఎట్లు పలికినను బలికినవాని యుద్దేశ్యమును వినువాఁడు గ్రహింపఁగలుగునా? అట్లుచేయఁగలిగినచో నీప్రపంచములో నొకకుటుంబములోని వనిచెప్పఁబడు నిన్నిభాష లెందుల కాకుటుంబములో సర్వసాధారణములు గావు? వేఱువేఱు పలుకుబడులతో నారబ్ధమగుభాషల నొకటిగాఁజేయుట యెట్లు? కనుక నీగ్రాంథికవ్యావహారికత్వధర్మము లనివార్యపృథక్పథము లని యొప్పి యూరకుండుట మంచిది.

పండితులు పరస్పరవిజయేచ్ఛ గలిగి యుందురు గదా యని యంతట నసూయాపీడితు లగుదు రనునింద కర్హ్వాలుగారు. అదివారినుదుటనేవ్రాయఁ బడలేదు. ఎందైన సామర్థ్యము గల ప్రతిమానవుఁడును సామర్థ్యము గలప్రతిమానవునితో నాయంశము ప్రస్తావింపఁబడినప్పుడు

తనసారత్వమును వెల్లడింపకపోదు. అది న్యాయ్యముకూడ నగును. కనుకనే మహాకవి కాళిదాసుగారు "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞాన" మ్మనియు "తం సన్తః శ్రోతు మర్హంతి సదసద్వ్యక్తిహేతవః" యనియుఁ బ్రశంసించి యున్నారు. పదవాక్యప్రమాణజ్ఞ భవభూతిమహాకవికూడ "ఉత్పత్స్యతే స్తి మమ కోపి సమానధర్మా" యని సవిచారముగనైనఁ బండితప్రశంస చేసియున్నాఁడు. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమ" మ్మను సమక్తికూడఁ బండితుఁడు చేసినకావ్యాదికమును బండితులకే యర్పింపవలెనని యుద్బోధించుచున్నది. "సమకాలురు మెచ్చ రెన్నఁడున్" అనుచేమకూర వేంకటకవి దూషణపరవాక్యములు వ్యతిరేకముఖమునఁ బండితప్రశంసఁ జేయుట లేదా? వీరందఱుఁ బండితుల మెప్పును గోరియే కాదా వారి నుగ్గడించుట మొదలగునవి జరిగియున్నవి? కనుక పండితులు గ్రంథకర్తలనో రడంచుటకు వ్యాకరణ మను మహామోహనద్రవ్యమును దెచ్చిపెట్టి రని నిష్కారణముగ వారిని నిందింపక వారిపైఁ జిరాకు మాని పరాకులేక శాస్త్ర మభ్యసించి వరాల కెన యగు సత్కావ్యములను రచించి మిరాతిగులైనపండితశూరులకే కానుకగాఁ జేసినచోఁ జతురాననయువతి కంఠమున నిస్తులముక్తాకలాపసమర్పణ మగు నని నాచిత్తసర్వస్వము.

అయిన, వ్యవహారదుష్టపదములు గ్రాంథికకవుల రచనలయందుఁ గూడఁ గానఁబడుచున్నను, గ్రాంథికవ్యావహారికభాషాభేద మట్లే యుండవలె నని మీయభిప్రాయమా? యనినచో "శాస్త్ర ప్రయోగవచసోశ్శాస్త్రం బలవ దుచ్యతే, అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్" అనుప్రామాణికవచనమునుబట్టి వ్యవహారదుష్టపదములు బహుపండితప్రయోగమధ్యమునఁ దఱచు మెలఁగెనేని యవి యనివార్యగ్రాహ్యము లని వేఱుగఁ బునరుక్తి యవసరము లేదు, గావున, నాపదముల విషయమై వ్యాకరణము చాల దనుమొదలుగాఁ గల తద్దూషణములు సంకుచితదృష్టిమూలకములు గాని, న్యాయములు గా వని విన్నవించుచున్నాను.

---

# తిక్కన—భారతరచన.

—విద్వాన్. పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు, పిఠాపురము.—

---

మనుమసిద్ధిక్షమాపాలుని రాజ్యచక్రమును దన యసమానమేధాశక్తిచే నస్ఖలితముగా నడపిన సామాదిచతురుపాయజ్ఞుఁ డగుమహామంత్రియు, వేదశాస్త్రాధ్యయనము చేసి తదుక్తకర్మాచరణమునందు మిక్కిలి యాసక్తి గలిగి స్వాహాస్వధాశబ్దద్వయసంస్కృతము లగుహవ్యకవ్యములచేత దేవతలను బితృదేవతలను దృప్తిపఱిచిన సోమయాజియు, నుభయభాషాకవిత్వంబున మిగులఁ జతురుఁడై యుభయకవిమిత్రుఁ డనఁ బేరుఁ గాంచిన మహాకవియుఁ, దాను గృతికర్త యయ్యు నితరకవులచేఁ గృతులందిన మహాత్యాగియు, నిరంతరస్మరణీయచరితుండును, హరిహరాద్వైతభావనాపవిత్రీకృతహృదయుండును, నగుతిక్కన సోమయాజి నిర్వచనోత్తరరామాయణాదికృతులను రచించియుఁ దృప్తిలేక తాను సంసారసాగరమును దరించుటకును, భారతకథారసపానముచేత 'నాంధ్రావళి మోదముం బొందుటకును' దనమనంబున ననువైన మార్గము నాలోచించి మహాభారతము విరాటపర్వము మొదలు పదునైదుపర్వము లాంధ్రీకరించెను.

మనకవిబ్రహ్మ తనయాంధ్రీకరణమునఁ సంక్షిప్తీకరణవిపులీకరణముల సాహాయ్యమున గ్రంథ మంతయును నడపినాఁడు; మఱియుఁ గొన్నిచోట్ల నౌచిత్యమునే ప్రధానముగాఁ జేసికొని మూలమున నున్నదానిని దెనిఁగింపక విడుచుటయు, మూలమున లేనిదానిని గల్పించి పెంచుటయును జేసినాఁడు. ఇట్టిమార్పుల దక్షక కవులెల్లరును జేయవలయు నని ధ్వనిమార్గప్రతిష్ఠాపనాచార్యుఁ డగు నానందవర్ధనుఁడు చెప్పెను చూడుఁడు.

శ్లో. ఇతివృత్తవశాయాతాం త్యక్త్వా౽ననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్ష్యో౽ప్యంతరాభీష్టరసోచితకథోన్నయః.

---

ఈవ్యాసము శ్రీసూర్యరాయవిద్యానందపుస్తకభాండాగారమున జరిగిన తిక్కనవర్ధంతి సందర్భమునఁ జదువఁ బడినది.

ఇతివృత్తవశాయాతాం కథంచిత్ రసాననుగుణాం స్థితిం త్యక్త్వా పునః ఉత్ప్రేక్ష్యాపి అంతరా అభీష్టరసోచిత కథోన్నయో విధేయః యథా కాళిదాసప్రబంధేషు (శాకుంతలాదిషు) కవినా ప్రబంధ ముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యం. తత్రేతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్ తాం భఙ్క్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతర ముత్పాదయేత్.

శ్లో. అనౌచిత్యా దృతే నాన్యత్ రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" (ధ్వన్యాలోకము.)

ఆలంకారికమార్గమును జక్కఁగాఁ బరిశీలించి యౌచిత్యానౌచిత్యములను గుర్తించి తిక్కన తనభారతమును దీర్చి దిద్దినాఁడు. ఈమహాకవి యేవిషయమును వర్ణించినను పాఠకులను ద్రష్టలను జేయునట్లుగా వర్ణింపఁగలఁడు. దీనికి ముఖ్యోదాహరణములు:—అభిమన్యునియుద్ధఘట్టము, కృష్ణునిరాయబారపుఘట్టము. ఇట్టిఘట్టము లింకననేకములుగలవు. ఈఘట్టములు చదువునప్పు డీగ్రంథమున కొకమూలగ్రంథము కల దనియును దానికిది యాంధ్రీకరణ మనియు నెట్టివిద్వాంసునకేని తోఁపదు. అచ్చముగా నాంధ్రముననే (అనఁగా సంస్కృతమున లేకయే) తొలుత నీగ్రంథము రచింపఁబడిన దనుదృఢవిశ్వాసము పాఠకులకుఁ గలుగునట్లు రచించినతిక్కనకవి మహాప్రతిభకు నమస్కరింపని యాంధ్రకవి యుండఁడు; కావుననే కవిత్రయములోనివాఁడగు నెఱ్ఱనార్యుఁడు తనహరివంశమునఁ దిక్కనను గవిబ్రహ్మ యని నుతించినాఁడు.

మ. తనకావించినసృష్టి తక్కొరులచేతం గామి నా నేమఖం
బునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందు నా వాణి న
త్తను నీతం డొకరుండ నాఁ జను మహత్త్వాప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

మనతిక్కనకు సాక్షాచ్ఛిష్యుఁడును మార్కండేయపురాణము నాంధ్రీకరించినవాఁడును నగుమారయ యాతనిగూర్చి యిట్లు చెప్పినాఁడు.

చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాకథా
విభుఁ బరతత్త్వబోధను నవీనపరాశరసూను సంతత
శ్రీభవనకీర్తిసీయయశుఁ దిక్కకవీంద్రుని గొల్తునర్థితోన్.

ఇందలి 'నవీనపరాశరసూను' 'ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు' అను విశేషణములు నాఁడు తిక్కనయందు వారికిఁ గలగౌరవమునకు సూచకములు. ఇంకను తిక్కనను గూర్చి విశేషములు తెలిసికొనుటకు దశకుమారచరిత్రమొక్కఁ డాధారముకలదు. దీనిని కేతన తిక్కనకుఁ గృతియిచ్చినాఁడు. ఇందేఁ దిక్కనవంశము వర్ణింపఁబడినది. ఈవిధముగాఁ(అనఁగాఁగృతిద్వారమున) దనవంశమును దాను వర్ణించుకొననక్కఱ లేకయే యితరులచే వర్ణింపఁజేసికొనిన తిక్కన వివేక మెట్టిదో యాలోచింపుఁడు. ఇఁకఁ గేతన తిక్కనను గూర్చి చెప్పినదానిని గొంచెము పరికించినచో నాతనిప్రవర్తనమును బ్రతిభాపాండిత్యములును స్పష్టముగాఁ దెలియఁగలవు. చూడుఁడు.

సీ. సుకవీంద్రబృందరక్షకుఁ డెవ్వఁ డనిన వీఁ
డనునాలుకకుఁ దొడవైనవాఁడు,
చిత్తనిత్యస్థితశివుఁ డెవ్వఁ డనిన వీఁ
డనుశబ్దమున కర్థమైనవాఁడు,
దశదిశావిశ్రాంతయశుఁ డెవ్వఁ డనిన వీఁ
డనిచెప్పుటకుఁ బాత్రమైనవాఁడు,
సకలవిద్యాకళాచణుఁ డెవ్వఁ డనిన వీఁ
డనిచూపుటకు గుఱియైనవాఁడు,
మనుమసిద్ధిమహేశ సమస్తరాజ్య
భారధౌరేయుఁ డభిరూపభావభవుఁడు
కొట్టరువుకొమ్మనామాత్యు కూర్మిసుతుఁడు
దీనజనతానిధానంబు తిక్కశౌరి.

క. అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా

నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.

సీ. నరసకక్షోంద్రుల సత్ప్రబంధము లొప్పఁ
గొను నను టధికకీర్తనకుఁ దెరువు
లలితనానాకావ్యములు చెప్పు నుభయభా
షలయందు ననుట ప్రశంసనత్రోన
యర్థిమైఁ బెక్కూళ్ళ నగ్రహారంబులు
గా నిచ్చు ననుట పాస్తపాలము
మహిత దక్షిణలైన బహువిధయాగంబు
లొనరించు ననుట వర్ణనముచొప్ప
వరుని కొకనికి నిన్నియుఁ బ్రకటవృత్తి
నిజము లై పెంపుసొంపారి నెగడు నెట్టుఁ
గొమ్మనామాత్య తిక్కనికొలఁది సచివుఁ
డింక నొక్కరుఁ డెన్నంగ నెందుఁ గలఁడు.

క. చతురానన సన్నిభునకు
సతతస్వాహాస్వధాదిశబ్దస్వనసం
స్తృతహవ్యకవ్యసంత
ర్పితమఖశిఖిముఖనిలింపపితృవర్గునకున్.

ఇఁకఁ దిక్కనకవి క్షిప్తీకరించిన చోటులును విపులీకరించిన తావులును, ఔచితీసంపాదనకై యన్యమార్గముల నవలంబించినచోటులును క్షిప్తముగాఁ జూపుచున్నాను.

—క్షిప్తీకరణమునకు—

కవిబ్రహ్మ రసము చెడకుండుటకును కథ పాఠకులకు విసుగుపుట్టింపక వేగముగా నడచుటకును కొన్నిచోట్ల మూలములోని విషయములను క్షిప్తీకరించినాఁడు. అయినను దనకృతహస్తతను గొంత కనఁబఱిచినాఁడు. చూడుఁడు.—భార-ఉద్యో-3-౧౫౭.

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁగోడలి కెక్కుడు చూచుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కటఁగోటిమడుంగులు భక్తి నాకు నె
య్యడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య ప్రౌ
ఢి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి ప్రొక్కితిన్.

ఈపద్యమునకు మూలమును గూడ నిటఁ జూపుచున్నాను.

“సర్వైః పుత్త్రైః ప్రియతరా ద్రౌపదీ మే జనార్దన. సం. భార. ఉద్యో. ౯౦ అధ్యా. ౪౩.”

ఈవిషయమునే తిక్కనకవి చతురముగాఁ “గొడుకులకంటె... చేయుచుండు.” ననుపలుకుఁ బెంచివ్రాసినాఁడు.

శ్లో. ...తథా వృత్తా...సం. భార. ఉద్యో. ౯౦ అధ్యా. ౪౮.

(తథావృత్తా=పుణ్యశీలా. నీలకంఠ వ్యాఖ్య.)

ఇది “పుణ్యచరిత్ర” అనుదానికి మూలము.

శ్లో. కులీనా...... ,, ,, ,, ౪౩.

శ్లో. మహాభిజనసంపన్నా... ,, ,, ,, ౪౭.

ఇవి “కులాగ్రగణ్య” యనుదానికి మూలములు.

శ్లో. పతిభిః పంచభిశ్శూరై రగ్నికల్పైః ప్రహారిభిః,
ఉపపన్నా మహేష్వాసైః...... ౪౬.

ఇందలిభావమునే “సభర్తృక” యనునర్థము గల “ప్రౌఢి”యను పదముచేఁ బ్రకటించినాఁడు.

శ్లో. సర్వపైరిక్షస్త కురవః...౯౦

ఇది “సకలంబుఁ జూడ” ననుదానికి మూలము.

శ్లో. తస్మాద్దహతి యత్కృష్ణా, సభాయాం కురుసన్నిధౌ, ధార్తరాష్ట్రైః
పరిక్లిష్టా...౯౭.

ఇందలిభావమునే “సభ దైన్యముఁ బొందుట సూచి ప్రొక్కితిన్” అని చెప్పినాఁడు. ఈవిధముగా ననేక శ్లోకములలో వ్యాసమహర్షి చెప్పిన విషయము నొక్కపద్యములోఁ దిక్కనమహాకవి సంగ్రహించినాఁడు.

— విపులీకరణమునకు. —

౧. సోమయాజికిఁ దనదేశాచారముల యందెక్కువ మక్కువ. అను నేకచోట నయ్యాచారములను బ్రవేశపెట్టుచుండును. చూడుఁడు:—

శ్లో. ప్రతిగృహ్యచ తాం పార్థః పురస్కృత్య జనార్దనమ్
వివాహం కారయామాస సౌభద్రస్య మహాత్మనః

శ్లో. కృతే వివాహే తు తదా ధర్మపుత్రో యుధిష్ఠిరః
బ్రాహ్మణేభ్యో దదౌ విత్తం యదుపాహరదచ్యుతః.

అని క్లుప్తముగా వ్యాసుఁడు చెప్పిన వివాహగాథను దనదేశాచారముల నందఱఁ జొప్పించుటకును బాఠకులకు రసాంతరానుభవముచేఁ గొంత యుత్సాహమును గలిగించుటకును విస్తరించి వర్ణించినాఁడు. అందలి తలఁబ్రాలుపోసికొనుట మున్నగునవి యాంధ్రాచారములే. ఇట్లే భీముఁడు విరాటునియొద్ద మల్లులతోఁ 'గుస్తీకట్లు' పట్టునపుడును సంస్కృతమున లేకున్నను దనకాలమున నాంధ్రదేశమునఁ బ్రసిద్ధములై యున్న 'కుస్తీపట్లు' నే యెంతయో రమ్యముగా వర్ణించినాఁడు.

౨. శ్లో. క్లేశితశ్చ వనే సూరో వాసవేన చ శిక్షితః
అమర్షవశమాపన్నో యోత్స్యతే నాత్ర సంశయః.
సం. భార. విరా. ౪౦ అ ౨౬.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.
భార. విరా ౪-౯౭.

ఇక్కడఁ జక్కని యుపమానమును గల్పించి శ్లోకమునందలి భావమున కెట్టిశోభను గలిగించినాఁడో చూచితిరా!

—అన్యమార్గావలంబనమునకు—

"క్లేశితశ్చవనే" ఇత్యాది శ్లోకమునకు వెనుక

శ్లో. ఏవపార్థోహివిక్రాంతో... నాజిత్వావినివర్తేత సర్వానపిమరుద్గణాన్.

సం. భార. విరా. ౪౦ అధ్యా. ౧౬ మొదలు ౨౫ వఱకుఁ గల షడ్శ్లోకముల నిక్కడఁ దిక్కన తెనిఁగింపలేదు. వీలయిన నీశ్లోకములలోని భావమునే మరలఁ గర్ణుని నిందించు కృపాచార్యునిచే శ్లో. ఏకో హి శక్రాన్ సమరే సమర్థః ప్రతిబాధితుం,—తథా నివాతకవచాః కాలకేయాశ్చ దానవాః, దైవతై రప్యవధ్యా స్త ఏకేన యుధిపాతితాః.

అని క్లుప్తముగాఁ జెప్పించినాఁడు వ్యాసమహర్షి. మఱితిక్కన యుసమయమున గురువగు ద్రోణాచార్యునిచే నర్జును నంతగా నుతింపఁజేయుటకన్నఁ గర్ణుని గర్వోక్తులకుఁ గ్రుద్ధుఁడైన కృపునిచేతనే యర్జునస్తుతి చేయించుట యుచితముగా నుండు ననియును, ద్రోణునిచేతను గృపునిచేతను గూడ నొక్కమాఱుగానే పైవిధముగా నర్జునస్తుతి చేయించుట సరసము గాదనియును దలఁచి యీవిధముగాఁ గృపునిచేతనే యర్జునస్తుతి చేయించినాఁడు.

వ. అక్కిరీటి యొక్కరుఁడ కాఁడే యని తలంతుమేని—

సీ. శక్రాది సురులతో సంగ్రామ మొనరించి
ఖాండవం బేర్చ నొక్కరుఁడ కాఁడె
యాదవబలమెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ
గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు సేసె ని
క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వపతినోర్చి విడిపించెఁ
గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె
యని నివాతకవచులను దానవుల నాతఁ
డొక్కరుఁడ కాఁడె యుక్కుమడఁచె
నమరులకు నజేయు లగుకాలకేయుల
నొక్కరుఁడ కాఁడె యొడిచెఁ గర్ణ! భార. విరా. ౪-౨౧౦.

మఱియును దిక్కన భావోద్రేకమును వర్ణించునప్పు డొకవిధ మగు నూతనపక్కి నాశ్రయించి యెంతయో రమ్యముగా వర్ణించును.

గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి
చేతఁ గవ్వడి నడఁచ నని చూతు వేని
వాసుదేవునిచే నది ప్రయ్యలయ్యెఁ
దునియ లయ్యును బొడియయ్యెఁ బోరఁ గుధరణి. ఉద్యో. ౨-౨౭౨.

గీ. పాండవులకుఁ దగుపాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచితం బగువిధ మెద్ది
శక్య మెద్ది చెప్పుఁడ వాక్యవిదులు. ఉద్యో. 3-౨౭౫.

క. నిండెసమయాబ్దములు నిం
కొండన లే దిపుడు చని సుయోధనుతో భీ
ష్ముండును గురుఁడును వినఁగా
నిండె ననుము నిండె నిండె నిక్కంబునకున్. విరా. ౪-3౭౦.

ఈవిధముగఁ దనభారతరచనయం దనన్యసామాన్యప్రతిభను బ్రకటించి కృతార్థుఁడైనాఁడు. ఆట్టికవిబ్రహ్మను గనుటచే నాంధ్రదేశమాతయు కృతార్థురా లైనది.

శా. మూలం బొక్కఁడు దీనికిం గలుగునే మూలంబు తాఁ జూడకే
వైళం బీకృతి తిక్కయజ్వ కవితావాల్లభ్యమేపార నా
నాలంకారరసౌచితీయుతముగా నల్లెన్ జుమీయంచు ధీ
శాలుల్గూడ నుతింప భారతము యజ్వా! కూర్చి మాకీయవే!

ఉ. నీమహిమం బచింత్యము, గణింప నశక్యము నీకవిత్వశో
భామహిమం బనన్యసులభం బగుఁ దావక పాత్రపోషణా
శ్రీమహిమం బుదాత్తము వచింపఁగ నీకునయప్రశస్తి ని
న్నోమహిమాకరా! తెలుతు మోపినభంగి ననుగ్రహింపవే.

# గ్రంథస్వీకారము.

## గృహలక్ష్మి.

దసరాసంచిక:—చెన్నపురమున స్త్రీలజ్ఞానాభివృద్ధికై డాక్టరు కే. యస్. కేసరిగారిచేతఁ బ్రకటింపఁబడుచున్న గృహలక్ష్మి మాసపత్త్రికకుఁ బ్రతిసంవత్సరము వలెనే యీసంవత్సరమును దసరాసంచికను బ్రకటించిరి. సంచికయంతయు సతీలలామలచేతనే వ్రాయఁబడిన వివిధవిషయ వ్యాసములతో నిండియున్నది. స్త్రీలు వ్రాసికొన్నవియే గనుక విషయము లన్నియు స్త్రీలయభివృద్ధినిగూర్చినవే యని వేఱుగఁజెప్ప నక్కఱయుండదు. ఇట్టిపత్త్రికను బ్రకటించుచున్న శ్రీడాక్టరుగారి నభినందించుచున్నారము. కాని, జ్ఞానాభివృద్ధి నందుచున్న నారీమణు లందఱును మాతృభాషనుగూర్చి యశ్రద్ధ చేయుచున్నా రని వగచుచున్నారము.

## ఆంధ్రభూమి.

ఇది చెన్నపురములో శ్రీయుతులు ఆండ్ర శేషగిరిరావు పంతులు బి. ఏ. గారిచే నడపఁబడుచున్న దేశోపకారకమాసపత్త్రిక. ఈ 1938వ సంవత్సరము సెప్టెంబరునెల పత్త్రిక యంతయు (౭ సంపుటము-బహుధాన్య, భాద్రపదము ౨ సంచిక) "మదరాసుసంచిక" యను నామముతో వెలువడినది. విషయము లన్నియు మదరాసునుగూర్చినవియే.

"మదరాసు మహానగరము ముమ్మాటికి మనది. దానికిఁ జెన్నపురి యనుపేరు మనమిచ్చినది...మద్రాసు లేనియాంధ్రరాష్ట్రము తలలేని మొండెము, మద్రాసు అనునిరుసుమీఁద ఆంధ్రుల భవిష్యచ్చక్రము దిరుగనున్నది. మద్రాసు మనరాష్ట్రములోనుండి పోయినయెడల మన నిధులుపోవును." ఈరీతిగా మద్రాసు మనయాంధ్రరాష్ట్రమునకు ముఖ్యనగరము కావలెనని చెప్పు వ్యాసము లనేకములు గలవు. మొదటినుండియు నాంధ్రులవలననే మద్రాసునగర మభివృద్ధిలోనికి వచ్చిన దనియును

దెల్పఁబడుచున్నది. అనేకులుచరిత్రములను బరిశీలించియతినిపుణముగను యుక్తియుక్తముగను వ్యాసములను లిఖించియున్నారు. చాలసంతోషము. కాని ఆంధ్రదేశమునకై, యాంధ్రభూమికై, యాంధ్రరాష్ట్రమునకై, భగీరథప్రయత్నములు చేయుచున్న యాంధ్రులందఱు నాంధ్రభాష నధోగతికిఁ దెచ్చుచున్నారు. ఆంధ్రభాషను నీరసస్థితికిఁ దెచ్చుచున్నప్పుడాంధ్రభూమి యేయసంతోషాధారమునఁ గాలూనుకొనియుండునా, యని మాత్రము విచారముగా నున్నది.

---

### కన్నడనుడి.

ఇది, బెంగుళూరులో నిరువదిమూఁడు వత్సరములక్రిందట స్థాపింపం బడిన కర్ణాటసాహిత్యపరిషత్తువారిచే, నూతనముగా వెలువరింపఁబడుచున్న వారపత్రిక. మొదటిసంపుటము, మొదటిసంచిక మాకందినది. కర్ణాటకభాషలోనాంధ్రభాషలోకంటె ననేక వారమాసపత్రికలు, కన్నడభాషాపోషకములు గలవు. తగినంతభాషాభిమానుల యాదరణము వానికిఁగలదు. కన్నడసాహిత్యపరిషత్తువారిపుడీవారపత్రిలోఁ గూడఁ గేవల భాషావిషయములనే ప్రకటించుచున్నారు. ఈపత్రికకు శ్రీ అ. న. కృష్ణరాయరుగారు సంపాదకులుగానున్నారు. ఈకర్ణాటసాహిత్యపరిషన్ముఖమున వెలువడు కన్నడనుడి దేశమున కంతకును జేఁదోడు వాదోడుగా నుండుఁగాత! మహారాజాదరణమునందిన యీభాషకు నీపత్రికలకుఁ గొఱఁతయేమి!

---

### మదవిదళనము.

ఇది యొక్క చిన్నపుస్తకము. చెన్నపురములో, ముత్యాలపేట హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు విద్వాన్ తా. అప్పుగంపిళ్లెగారు రచించినది. (క్రౌనుసైజు) ౬౩ పుటలుగలది. క్షేమేంద్రమహాకవి యొక్క దర్పదళనమను గ్రంథమును జదివి, యారీతిని దెనుఁగులోవచనరూపమున నొక్క కావ్యమును రచింపవలయు నని యుత్సాహపడి ప్రారంభించినది. ఇందు మదవిదళనవిషయములే పెక్కులు గలవు. మదము, అనఁగా గర్వ

ము:—కూడనిది దానివలన ననేకానర్థము లున్నవని చూపుటయే కవి కహంక, కావున, గర్వలక్షణము—కులమదము, దాని నిర్వాసనము, ఇట్లే ధనమదము, దానిదళనము, విద్యామదము, దానివిదళనము, రూపమదము, దానివిదారణము, యౌవనమదము, తన్మదధ్వంసనము, అధికారమదము, తద్ధరణము, ఆచారమదము, తన్నిరాసము నని చిన్నిచిన్ని యుదాహరణములలో వివరించియున్నారు. భాషజటిలము సిద్ధప్పమునై రాజిల్లుచున్నది.

ఈవిద్వాంసులు, "ఆంధ్రవాఙ్మయలక్షణదర్పణమును" వ్రాయుచున్నారు. అఱవములోని కంబరామాయణము నాంధ్రీకరించుచున్నారు.

ఈ మదవిదళనము వెల యెనిమిదణాలు.

---

## సాంఖ్యాదర్శము.

శ్రీఉర్లాముజమీందారులగు శ్రీరాజా కందుకూరి బాలసూర్యప్రసాదబహద్దరుగారు చిరకాలమునుండి వ్రాయుచున్నట్టి యాంధ్రభాషానమను విజ్ఞానసర్వస్వమున కనుబంధము. సంఖ్యార్థనామప్రకాశికయను నది తొల్లియొక్కటి శ్రీకనుపర్తి వేంకటరామశ్రీవిద్యానందనాథవిరచితముకలదు. దానికంటె నిది విలక్షణమైనది. దానికి దీనికిని భేదమేమన- నిందు విషయవివరణముగలదు. అందుఁగేవలపదములు మాత్రమే చెప్పఁబడెను. ఉదాహరణము:—పన్నిద్దఱాళ్వారులు-వీరిలోఁ దొమ్మిదవవాళ్వారు "తిరుమంగైయాళ్వారు (పరకాలయతి) వీరికి-కవిధ్వంసులనియుఁ జెప్పఁగలదు. కవిలోకదివాకరులనియు, చతుష్కవి శిఖామణులనియు, షట్ప్రబంధకర్తలనియు, కవివైరియనియు బిరుదనామములు కలవు. తిరునావిత్తిరునగరు అనుగ్రామమున కలియుగమున నాల్గువందల వత్సరములనాఁడు నీలుఁడను శూద్రునకుఁ జనించి ధనుర్విద్యనేర్చి చోళభూపతి కడ కొలువుండి (అయోనిజ యగు) కుముదవల్లిం గోరి దొంగిలించిన ధనముతో నామె బడసినవారు వృశ్చికమాస (కార్తికనెల) కృత్తిక వీరితిరునక్షత్రము. విష్ణుదేవుని శార్ఙ్గాంశసంభూతులు."

---

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## తృతీయాశ్వాసము.

---

క. శ్రీవిలసద్గాత్రము భా
ర్యావృజినప్రశమహేతురాఘవపద రా
జీవధ్యానప్రసుతివ
ద్యావర్తీ వెల్లలూరి హనుమన్మంత్రీ. ౧
వ. అవధరింపుము.

—: రేఫఱకారనిర్ణయము :—

గీ. కృతుల రేఫఱకారసంగతులగతులు
లలితదశరూపనాటకలక్షణములఁ
జిత్రకవితలకొన్నివిశేషములును
నాఱుప్రత్యయములఁ దేర్తు నార్య లెస్స. ౨
క. తా నేమి చెప్పినాఁ డి
ట్లా నని రఁట యెవ్వఁ డెఱుఁగు ననకుఁడు సుకవుల్
నా నేర్చురీతి మీకృపఁ
బూనుక రేఫలు ఱకారములు నేర్పఱతున్. 3
గీ. పృథివి జీవుఁ డీశుఁ డను నభేదవాది
వలెనె వాదించి కుకవి దుర్వాదిసభలఁ
దాను రేఫకు ఱాకు భేదమె యను నది
కృతులు చేకట్టుసుకవిసమ్మతము గాదు. ౪
క. ఇడఁ దగు రేఫకు రేఫయె
యడరఁగఁ బ్రాసము ఱకార మైన ఱకారం
బిడఁ దగును గాని రెండును
బడిఁగలయఁగఁ జెప్పరాదు పావని వింటే. ౫

క. తలకట్టు గాక యెత్వమె
యలవడఁ జజసలను మూఁట నది మొదలగుచోఁ
దెలుఁగుల మొదళ్ల నెయి లివి
యలహల్లులు గావు స్వరము లగు వ్రాయంగన్. ౬

ఉదాహరణము:—

గీ. చెలువ చేకటొవ్వ జేన యనంగను
సేసకొ వ్వసంగఁ జెల్లు మూఁట
నెఱుక యఁర వసంగ నీరెండువర్ణంబు
లచ్చు లగును హల్లు లాది గావు. ౭

గీ. ఆంధ్రసంస్కృతపదములయందు మొదలి
వైన ఉఊలు ఓకార మనెడు లిపులు
స్వరము లగుఁగాని హల్లు లై చొరవు గనుక
వాకు నుత్వోత్వముల నవి వ్రాయరాదు. ౮

ఉదాహరణము:—

గీ. ఉల్ల ముదిద యుడుటు నూరును నోపిక
యనెడుకలుకు లెల్లఁ దెనుఁగు లౌను
ఉదధి యున్నతంబు నూర్వశి యోంకార
మమరు ననఁగ సంస్కృతము నఁ జెల్లు. ౯

సీ. సంస్కృతార్ణములఁ దత్సమమగు తెలుఁగుల
యందుఁ గ్రియాపదాంతాక్షరములఁ
బలుకుచోఁ రేఫలు గలుగు నింతియె కాని
గలుగదు బండిఱకార మరయ
అద్వయి ఇద్వయి ఎద్వయి ఒబొలు
కగచజతదపబాక్షరము లెన్న
నమరవసల లిన్ని యమర నిర్వదిరెండు
వీనిపై ఱారేఫవితతు లొదవు

వాని వ్రాఁతలచేఁ దేర్చు వరుసతోడఁ
కడమయిరువదితొంబ్రక్షరములతుదఁ
కదిసి రేఫలు కలిగినఁ గలిగెఁ గాని
మఱి ఱకారంబు లే దెందు మారుతసుత. ౧౦

వ. ఇందు సంస్కృతపదంబులఁ దత్సమమగు తెలుఁగుపదంబులఁ రేఫలు గలవు ఱకారంబు లేకుండుట సుప్రసిద్ధం బగుఁ గ్రియాపదాంతాక్షరంబులపై రేఫవర్ణంబు లెట్టి వనిన. ౧౧

ఉదాహరణము:—

క. వ్రాసిరి వచ్చిరి యొప్పిరి
చేసిరి యన నాదిగాఁగఁ జెన్నగుక్రియలన్
వాసిన తెనుఁగులఁ గలయవి
భాసురముగ రేఫ లయ్యెఁ బవనతనూజా. ౧౨

గీ. రేఫక్రిందట ద్విత్వ మా రేఫ లేదు
ఘనఱకారంబె ద్విత్వఱకార మగును
ఱట్టునను గట్టు నొకయిఱ్ఱి మఱ్ఱినీడ
గఱ్ఱుగఱ్ఱుంబు గలవానికఱ్ఱ వినుము. ౧౩

వ ఇంక, అకారాదులపై వచ్చిన రేఫఱకారంబులకు వర్ణక్రమంబున వివరించెద. ౧౪

సీ. అఱిగొనె నరదాన నరిగెను నరవాయి
గొన కిరు దరగంటఁ గనియె నరయ
నరసి చల్లారఁ గన్నార నారెకు నన
నారంగ ధర్మంబు నారఁగూరె
నారఁగాఁగినపాలు నారెకు లారాట
మారటం బారనియుగ్గి యారె
నారయు నట్లు పొంగారె నారంగ న
ద్వయిమీఁద రేఫ లిర్వదియు రెండు

ఇరవు నిరువురు నిరువది యిరుగెలఁకులు
నిరుము నిరవార నొల్లఁబోయి రన నీరె
నీరికలుపుట్టె నీరేడు నీరెలుఁ గనఁ
బహునాగాంగ్రేఫ లివ్వియుపయిని హనుమ. ౧౫

సీ. అఱవఱ యఱకట యఱిముఱి యఱువది
యఱువుడు నఱుచు స్కక్కఱ యనంగ
నఱపొఱ డఱపులు నఱచెయి పొల్పఱి
యఱచునె కఱయఱు లఱుము లనఁగ
నఱలేక యఱుగును నఱుకమ్ము టఱకాలు
నఱగొఱ లేక సిగ్గఱి యనంగ
కజ్జూఱఁకఱ యఱుగుఁడుకుఱుసంబు బి
ట్టఱ యడలాఱ నోరాఱ నాఱు
రసము లాఱని తేజ మాఱాఁపు లాఱ
డి యన ముప్పదిరాలు నద్వయిని నిఱికి
యిఱులు నిఱుకట వీఱుసు క్రిక్కిఱియ నిఱిసె
నన వికారంబుపై ఱాలు నాఱుగఁ గజ. ౧౬

సీ. ఉరవట యురణించు రిమెడి యురులఁ ద్రో
యుట డెంద మురియాడ నురియు ననఁగ
నురుళింవ నూరక యుండుట నూరార్చు
టూరటపుచ్చుట యూరనుండి
యన నుద్వయంబుపై నొనరు రేఫలు పదు
నొం డివి కృతులలో దండిమెఱయు
నుఱువుగ రిపులపై నుఱుకుడు బలిముఱి
యుఱుముచు నుఱుకఱి నుఱుకచేతు
లూఱడిల నూఱు ననఁగను నూఱుగడన
నూఱ నన నుద్వయంబుపై నుప్పతిల్లు
బండిఱా లివి పదియయ్యెఁ బరఁగఁ దెలుఁగుఁ
గృతులఁ గవు లిఁకఁ బొలుపొందఁ గీశనాథ. ౧౭

సీ. ఎరగలి కెరువడి యెరగాఁగ నెఱియంగ
నెఱికె యేఱికెయన నెరవిడు మన
నేమీఁదిరేఫ లివేడగు నోఁడారు
లారు లారసిలఁగ మిన్నారయ నోఱిమె
నోరల కోఱిచి తోఱి యనఁగ రేఫ
లెన్మిది యోమీఁద నెసఁగె నింకి
నెఱకలు నెఱచియు నెఱుకలు నెఱుకయు
నెఱసఁజ యెఱుపును నెఱుఁగ లెఱుపు
యెఱుఁగుటనఁ దొమ్మి దేమీఁద నెనయు ఱాలు
యొఱువ దొఱవ్రల నొఱగాలు నొఱిగె నవిన
నొఱపుగలకత్తి యొఱలోన నొఱలు టనఁగ
సప్తసంఖ్య ఱా లోమీఁద జరగుఁ గభవ. ౧౮

సీ. కారుక్రొమ్మొగులు తొల్కరిఁ గర మొప్పంగఁ
గుఱియఁ గఱసెన మొక్కరుఁడు చేసి
కొరప్పనంబు చేకూర నిడుకరణి
కూర కారాకులు కూరుటయును
గరకరఁ గాలంగఁ గరఁగి కరువుఁబోసి
కోఁకి కూరిమి కోరఁజేసెఁ
గరవాలు కరుపలి కారింప కూరుకు
కూరుతు కా రాటకా రనంగఁ
గూరనాటిసమ్ము కొరప్రాణ మనఁ గారి
యంబును గరి గొరునది కరకరి
కారులు కెర లనఁ గకారాదిరేఫలు
ముప్పదియును రెండు ముఖ్యచరిత. ౧౯

సీ. కుఱఁగట కొఱమాలి కొఱఁతవడి కుఱుచ
కఱవునఁ గొఱగాదు కొఱవి యనఁగఁ
గఱటిఁ దెల్పఁగరాదు కాఱియ కఱకఁర
కొఱలి కొఱలువచ్చెఁ గెఱయ ననఁగఁ

గఱికలు కఱుకొని కాఱుటె కొఱపంబు
కొఱగల్లు కఱుమాపు కొఱకుఱ యన

... ... ...
... ... ...

గలకకారాదిపెద్దఱకారసంఖ్య
మొనయ ముప్పదినాల్గయ్యె నిజమంత్రి. ౨౦

సీ. గురువులుపారఁగ గరుడాల్చె మేన్గొర
గరువతనము గణఁగిరి గురువుగ
గురుసులు గురుగు తెగిరిపడి గిరగిర
గురుసు సింగారము గరగ గరిత
గారాము మ్రగ్గిరి గరిసెఁడి బంగారు
గురుగులు గరువము గోర మనఁగ
నిరువదియొక రేఫ లివి గకారము మీఁద
గిఱుపుట గొఱియల గిఱిచి పగఱ
గుఱుతు గిఱుట గఱి గుఱి గొఱక గొఱిజ
గిఱుక గఱుగులు గుఱుగుఱ గుఱుగు గఱిసె
గఱులు డగ్గఱి గిఱుమెట్లు గుఱుక గిఱికొ
నె నన బ్బా లిరువది గోపరిని యనిలజ. ౨౧

సీ. చేరువ తెచ్చిరి చెచ్చెర చేరిరి
చెఱుపు టచ్చెరువును జొరక యనఁగఁ
జొరవ యచ్చర లనఁ జూరె యచ్చెరియము
చీరమేన వచ్చిరి చెరిపిరి యనఁ
జిరుగని చెరఁగుల చీరలు నిల్చిరి
యన రేఫ లివి పదునెనిమి దయ్యెఁ
జిచ్చఱపిడుగును జిచ్చఱకును జొఱ
చిఱుకొట్టు చిఱమి మూచ్చిఱుతనంబు
చూఱవిడుచుట క్రచ్చఱ చుఱచుఱ యనఁ
గఱులు చఱచుట చిఱుపులి గట్లచఱులు

దఱుఁగుట తక్కువ తఱుఁగుట వెల్తియుఁ
దఱుఁగుట ఘేవనార్థంబు గయ్యె
దఱియుగు సత్త్రఱిఁ దఱచగు తఱిగొని
తొఱఁగువడుటయును దాఱఁగలింపఁ
దఱుముమఁ దొఱఁగమిఁ దొఱఁగులుపోవుచుఁ
దొఱగిన తవియుఁ దొఱఁగె ననఁగఁ
దఱఁగు తుఱుమును దిఱియుచు దాఱుటనఁగఁ
దూఱు తఱుముచుఁ దఱలనఁ దేఱుదు రనఁ
దేఱికనుఁగొనఁ దఱులనఁ దేఱటి యనఁ
దఱియుఁ జొఱుమనఁ దీఱఁగఁ దఱికి ననఁగ. ౨౭

గీ. తిఱుఁగఁజేయుఁడు తొఱులను దఱఁగ దీర్ఘ
కన్ను తెఱచుట మఱి తెఱఁగన్న నంగఁ
దఱిమి యని సేసెఁ దెఱఁగొప్పఁ దఱిగొలు పనఁ
దపరములఱాలు దృక్సముద్రము[1] లనిలజ. ౨౮

సీ. దురదుర జూదరి దొరలెల్లఁ గురుకుగ
దొరకోలు దురమాట దొరయుఁ డరుట
దురపిల్లు టురుకుట దొరకొల్వు దొరకొంట
దూరులు దరిద్రొక్కి దొరసి రనఁగ
దరికొని ననఁ బంచదశరేఫ లవి యయ్యె
ముండఱ కాలంబు ముంద టెదురు
నం దొఱలించెద ఱాదఱ మిద్దఱ
మొందఱు వదఱుట కొంద ఱనఁగ
నెద్దిఱా యనంగఁ బెద్దఱికం బన
నందఱు నెన్నంగ నింద ఱనఁగ
బండిఱాలసంఖ్య పదుమూఁట నగు నెన్న
దపరమునను గల్గి తరుచరాఘవ. ౨౯

1. దృక్సముద్రములు=౪౨.

ఈన్యాయము వేదాంతకల్పతరుపరిమళము ౫౮ పుటలో నున్నది.

### ౧౪౧. ఉభయతః పాశా రజ్జుః.

రెండువైపుల బంధించు త్రాడు. అనఁగా నుద్వేగమును గలిగించు స్థితి.

### ౧౪౨. ఏకదేశవికృత మనన్యవత్.

ఒకభాగమునందుఁ గలిగినవికారము వస్తువు నంతను మార్పనేరదు. ౧-౧-౫౬ అష్టాధ్యాయీ సూత్రముతో సంబంధించిన పదియవ వార్తికమునకు భాష్యములోఁ బతంజలి యీన్యాయము నుదాహరించినాఁడు. కుక్కకుఁ జెవులు గాని తోఁక గాని కోసివేసినచో నది గుఱ్ఱముగాఁ గాని గాడిద గాఁ గాని మాఱదు.

### ౧౪౩. ఏకసమ్బన్ధిదర్శనేఽన్యసమ్బన్ధిస్మరణమ్.

ఒకవస్తువును జూచినచో దానితో సంబంధించినది జ్ఞప్తికివచ్చును. తర్కభాషావ్యాఖ్యాన మైనన్యాయప్రదీపము ౪౪వ పుటలో "ధూమదర్శనమువలన దానితో సంబంధించిన యగ్ని స్మృతికి వచ్చును అని కలదు." "ఏకసమ్బన్ధిజ్ఞాన మపరసమ్బన్ధిస్మారకమ్".

### ౧౪౪. కపింజలన్యాయము.

కపింజల మనఁగా కౌంజుపిట్ట. వాజసనేయసంహితలో ౨౪-౨౦ "వసన్తాయ కపిఞ్జలా నాలభేత"—ఇచ్చట నెన్ని పిట్టల నాలభనము చేయవలయు నని యొకసంశయము కలుగును. ఈవిషయమై జైమిని యెనిమిది సూత్రములను వ్రాసి చర్చించెను.

### ౧౪౫. కమ్బలనిర్ణేజనన్యాయము.

గొంగళి నుతుకుట—గొంగళిని గాళ్లమీఁదఁ గొట్టి యుతికినచోఁ దాని మురికి పోవుటయే కాక కాళ్లమురికికూడఁ బోవును. ఒకపనిచేత రెండులాభములు కలుగుట. ఈన్యాయము శాబరభాష్యము ౨-౨-౨౫ సూత్రభాష్యములో నున్నది. "అపి చ దధి ఉభయ మసమర్థం కర్తుం ఫలం సాధయితుం హోమం చ నను కమ్బలనిర్ణేజనవ దేత ద్భవిష్యతి, నిర్ణేజనం హి ఉభయం కరోతి కమ్బలశుద్ధిం పాదయోశ్చ నిర్మలతామ్".

## ౧౮౩. కలంజన్యాయము.

కలంజ మనఁగా విషదిగ్ధబాణముచేఁ జంపఁబడిన మృగము యొక్క మాంస మని కొంద ఱందురు. మఱికొందఱు "బంగు" అందురు. ఈవస్తువు మాదకద్రవ్యము. గంజాయి. దీనికిఁ దామ్రచూడశబ్దము పర్యాయపదముగాఁ జెప్పఁబడియుండుటచేఁ బొగచెట్టని యర్థము. ఇందులకు జైమిని పూర్వమీమాంసలో ౬-౨-౧౯, ౨౦ సూత్రములలో నిషిద్ధపదార్థములను సేవించుటవలనఁ గలుగుచెడుగులను జెప్పు నొకయధికరణ మున్నది.

## ౧౮౪. కాకాధికరణన్యాయము.

కాకి వాలిన దేదో యొకవస్తువు——ఈన్యాయము పతంజలి మహాభాష్యము ౧-౧-౨౬ వార్త్తికములు ౩-౪ లలో నున్నది.

దేవదత్తునియిల్లేదియని యొకఁ డడుగును. దానికి, అదిగో-కాకి వ్రాలిన యిల్లేయని యొకఁడు చెప్పును. తర్వాత నాయింటిమీఁదికాకి యెగిరిపోయినయెడల దేవదత్తునియిల్లు కావలసినవానికిఁ దెలియరాదు.

౧౮౫. కాచిన్నిషాదీ పుత్రం ప్రసూతే, కశ్చిన్నిషాద స్తు కషాయపాయీ.

కొండదిపిల్లవానిని గన్నది. దానిభర్త కషాయము త్రాగుచున్నాఁడు. ఇది యొకనికిరోగము,మందుత్రాగుట మఱియొకఁడు——అను సామెతవంటిది. ఈన్యాయము "మునిర్జుహుతే మూర్ఖో ముచ్యతే" అను న్యాయమువంటిది. ముని పరబ్రహ్మమును ధ్యానించుచున్నాఁడు, మూర్ఖుఁడు ముక్తినొందుచున్నాఁ డని దీనియర్థము. ఈన్యాయము వేదాంతతత్త్వవివేకములో ౩౭వ పుటలో నున్నది. "ఏతే నేద మపాస్తం మునిర్జుహుతే మూర్ఖో ముచ్యతే, ఇత్యేత చ్ఛాస్త్రఫలం ప్రయోక్తరీతిన్యాయవిరుద్ధం తథాచాభాణకః——కాచిన్నిషాదీ తనయం ప్రసూతే కశ్చిన్నిషాద స్తు కషాయపాయీతి మునికర్తృకశ్రవణాది విధిఫలస్య సాక్షాత్కారస్య మూర్ఖేఽనభ్యుపగమాత్. తత్ఫల స్యావ్యవిద్యానివృత్తే మునిప్రత్యగ్మాత్రగతతయా మూర్ఖనిష్ఠత్వాభావాత్ దృష్టఫలానాం యథాదర్శన ముపపత్తేః.

## ౧౮౯. కూటకార్షాపణన్యాయము.

కూటకార్షాపణము=కృత్రిమమైననాణెము. ఇది కుమారిలభట్టుని తంత్రవార్తికము ౧-౩-౩ లో నున్నది. "శ్రుతిస్మృతులకు విరోధము సంభవించినపుడు శ్రుతి బలవత్తరము గావున స్మృతిని విడువవలయును. ఒక మనుష్యుడు కృత్రిమమైననాణెమును విడిచినట్లు "యోహికూటకార్షాపణం కంచిత్కాల మజ్ఞో లోకమధ్యే వ్యవహరతి న తేన వివేకజ్ఞానజనితవ్యుత్పత్తినా పి తథైవ వ్యవహర్తవ్యమ్."

## ౧౯౦. కేవలైర్వచనై స్సిద్ధనాథమన్త్రిక ఇవ సాధూన్ భ్రామయన్.

దరిద్రుడైనబుద్ధిహీనుడు పెద్దమనుష్యులైనవారిని మాయమాటలచేత భ్రమింపజేయును.

ఇది ఆత్మతత్త్వవివేకము ౭౦ వ పుటలో నున్నది. "అవస్తుత్వాదితిచే న్న త్వేత దపి కుతః సిద్ధం సర్వసామర్థ్యవిరహా దితిచే త్సోయ మిత స్తతః కేవలై ర్వచనై స్సిద్ధనాథమన్త్రిక ఇవ సాధూన్ పరస్పరాశ్రయదోష మపి న పశ్యతి."

## ౧౯౧. క్రియా హి వికల్ప్యతే న వస్తు.

క్రియ మార్పును జెందును గాని వస్తువు మార్పు నొందదు. ఈన్యాయము శంకరబ్రహ్మసూత్రభాష్యము—౧-౧-౨ లో నున్నది. "కర్తు మకర్తు మన్యథా వా కర్తుం శక్యం లౌకికం వైదికం చ కర్మ యథాశ్వేన గచ్ఛతి పద్భ్యా మన్యథా వా న వా గచ్ఛతి న తు వ స్త్వేవం నైవ మస్తి నాస్తీతి వా వికల్ప్యతే.

## ౧౯౨. క్వోష్ట్రః క్వ చ నీరాజనా.

ఒంటెయెక్కడ నీరాజనమెక్కడ. శరత్కాలములో రాజులు యుద్ధయాత్రకు బోవునపుడు తమసైన్యమందుండు గజములకు నశ్వములకు నాయుధములకు మంగళహారతు లీయవలయునని శాస్త్రము—లొట్టియలకీయు చార మెచ్చటను జెప్పబడి యుండలేదు. "వాజినీరాజనా విధిః" అని రఘువంశకావ్యములో ౪-౨౫ శ్లోకమును జూడుడు. అనర్హునికి బెద్దగౌరవము జరుగుటవిషయములో నీన్యాయము ప్రవర్తించును.

### ౧౫౩. గర్గశతదండనన్యాయము.

గర్గగోత్రజులకు నూఱురూపాయలు దండము విధించుట—"ప్రత్యేకం వాక్యపరిసమాప్తిః, సముదాయే వాక్యపరిసమాప్తిః" అని వ్యాకరణ పరిభాషలు. ఈరెండును మహాభాష్యమందుఁ దఱచుగఁ గలిపి ప్రయోగింపఁబడును. "దేవదత్తయజ్ఞదత్తవిష్ణుమిత్రా భోజ్యన్తామ్" అని మొదటిపరిభాషకు, "గర్గాః శతం దణ్డ్యన్తామ్" అని రెండవపరిభాషకు మహాభాష్యకర్త యగుపతంజలి యుదాహరణముగా నిచ్చియున్నాఁడు. మొదటిదానిలో దేవదత్తయజ్ఞదత్తవిష్ణుమిత్రు లనువారికిఁ బ్రత్యేకముగా భోజనము పెట్టవలయును-ఇది ప్రత్యేకవాక్యపరిసమాప్తి. రెండవదానిలో గర్గవంశస్థులందఱుఁగలసి సముదాయముపైని దండ మిచ్చుకొనవలయును. ఇది సముదాయవాక్యపరిసమాప్తి.

### ౧౫౪. గర్తస్థమృతసర్పన్యాయము.

గోతిలోఁ జచ్చిపడియున్నపాము—ఇది విజ్ఞానభిక్షువు రచించిన బ్రహ్మసూత్రభాష్యము ౧-౧-౨ సూత్రవ్యాఖ్యానము ౩౬ వ పుటలో నున్నది. "ప్రాక్సృష్టేః ప్రళయా దూర్ధ్వం నాసీ త్త్రించి ద్ద్విజోత్తమ"-(నరసింహపురాణము) "నాసీ దితి విరతవ్యాపారతయా కారణరూపేణ గర్తస్థమృతసర్పవ ద్విలీన మాసీ దిత్యర్థః" అగ్రంథకర్తయే యాగ్రంథమందే మఱియొకచోట నిట్లు వ్రాయుచున్నాఁడు. "ఏవం సర్వత్ర తాం చ ప్రకృతిం గుణత్రయరూపిణీం నిత్యా మపి నిర్వ్యాపారతయా గర్భస్థమృతసర్పవత్తిరణకారణవివిక్తే చిన్మాత్రే ఖిలాపయన్తి".

### ౧౫౫. గార్హపత్యన్యాయము.

ఇంద్రుని బరామర్శించు నొకమంత్రమును గార్హపత్యాగ్నికన్వయింపఁజేయుట-పూర్వమీమాంసలో ౩-౨. ౩-౪ సూత్రములు "నివేశన స్సంగమనో వసూనాం" ఇ త్యైన్ద్ర్యా గార్హపత్య ముపతిష్ఠతే" అను మంత్రమును గుఱించి చర్చించుచున్నవి.

### ౧౫౬. గోదోహనన్యాయము.

గోదోహనము=పాలు పిదుకుపాత్ర—పశువృద్ధిని గోరు యజ

మానవుఁడు యజ్ఞములోఁ బాలికిపతతో సిద్ధుఁడై వలయు నని శాస్త్ర మున్నది. ఈన్యాయము శంకరభాష్యము ౩-౩-౪౭ సూత్రవ్యాఖ్యానము లో నున్నది.

౧౯౭. నహీశ్వరవ్యాహృతయః కదాచి త్పుష్ణంతి లోకే విపరీత మర్థమ్. (కుమారసంభవము)

లోకమునఁ బ్రభువులమాటలు విపరీతార్థమును దెలియఁజేయవు.

౧౯౮. వత్సక్షీరన్యాయము.

ఎట్లు దూడయొక్క వృద్ధికొఱకు నచేతనమైనను క్షీరము ప్రవర్తించునో యట్లుగానే యచేతనమైనను ప్రకృతి పురుషునిముక్తికొఱకుఁ బ్రవర్తించును-"వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథా ప్రవృత్తి రజ్ఞస్య పురుషవిమోక్షనిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య" అని సాంఖ్యకారిక.

౧౯౯. నిర్విమర్శా హి భీరవః.

పిఱికివాండ్రు ముందువెనుకల నాలోచింపరు. ఇందులకుఁ గథాసరిత్సాగరములో లావణకలంబకమం దొకకథ కలదు. "పూర్వకాలమందు గంగాతీరమునఁ గామందిక యనునొకపట్టణ ముండెను. ఆపట్టణమందున్న బైరాగులమఠములో మౌనవ్రతి యగు నొకసన్న్యాసి నివసించుచుండెను. అతఁ డొకనాఁడు భిక్షార్థమొకకోమటియింటికిఁబోయి యచట రూపవతి యగువణిక్పుత్రికను జూచి కామాతురుఁడై "ఆహా! యేమికష్టము సంభవించినది" అని పెద్దకేక వేసి మఠమునకుఁ బోయెను. అంత నాకోమటి యామఠమునకుఁ బరుగిడి "అయ్యా స్వామీ! చిరకాలము నుండి మౌనవ్రతమును ధరించినమీరు మాయింటిలో నేఁ డావ్రతమును విడిచిపెట్టి పెద్దకేక వేయుటకుఁ గారణమే" మని యడిగెను. అందుల కా దుష్టసన్న్యాసి "కోమటీ-నీకొమార్త వినాశసూచకము లయిన యనేకదుష్టసాముద్రికలక్షణములను గలిగియున్నది, కావున, నీకన్యకను నీయింటిలోనుంచుకొన్న యెడలఁ గొలఁదికాలములో నీవు నీకుటుంబజనము నీ యైశ్వర్యము నశించిపోవును. కాఁబట్టి నామాట విని యీరాత్రి యొక పెద్దమందసమును దెప్పించి దానిలో నీకన్యక నుంచి మందసముపై నొక

పెద్దదీపమునుంచి గంగానదీప్రవాహమందు విడిచిపెట్టుము. అని యుప దేశించెను. కిటికివాఁడగు నాకోమటి సన్న్యాసి చెప్పినట్లు చేసెను.

౧౬౧. పాత్రాపాత్రవిచార స్తు ధేనుపన్నగయో రివ.

మనుష్యుఁడు దానముచేయునపుడు యోగ్యతాయోగ్యతలను బరిశీలింపవలయును. ఆవులకు గడ్డివేసినఁ దిని పా లిచ్చును. పాములు పాలు త్రాగి విషమును నిచ్చును.

౧౬౧. గ్రాష్టి కే భేవ.

రాతిపైఁ జెక్కిన రేఖవలె— అనఁగా శాశ్వతముగా నుండునది.

"తస్మాం వ్రజకుమారాయ సంప్రద త్తాన్యథా తు మే
మరణం శరణం తాత గ్రాష్టికే భేవ గీ రియమ్.

౧౬౨. చందనన్యాయము.

చందనబిందువు శరీరమం దొకచోట నుంచినచో దానిచలువ శరీరమం దంతటను వ్యాపించి చల్లగా నున్న ట్లాత్మయు దేహమం దొకచోట ననఁగా హృదయస్థానమం దుండి జ్ఞానప్రకాశముచే శరీరమంతను వ్యాపించును. బాదరాయణసూత్రములు, ౨-౩; ౨౩-౨౪ సూత్రములకు శంకరాచార్యులు వ్రాసినభాష్యమును జూడుఁడు.

౧౬౩. న హ్యేక మేవ సవిశేషం నిర్విశేషం చ భవతి.

ఈన్యాయ మద్వైతకొస్తుభమం దున్నది. "సత్యకామ స్సత్యసంకల్పః అస్థూల మనణ్వహ్రస్వమ్" అని యుభయవిధ మైన శ్రుతులు- బ్రహ్మము సవిశేష మనియు నిర్విశేష మనియుఁ జెప్పుచుండుటచే బ్రహ్మ యుభయలింగ మని చెప్పవచ్చును. అనిన బ్రహ్మయుభయలింగము కాదు. ఏలయన నొక్కవస్తువునకు రెండురూపము లు సంభవింపవు.

౧౬౪. అచిన్త్యాః ఖలు యే భావా న తాన్ తర్కేణ సాధయేత్.

జగజ్జన్మాదికము, జగదుపాదాననిమిత్తకారణములు, జగత్పరిమాణము, ధర్మాధర్మములు, మొదలగునవి చింతించుట కశక్యములు. వానిని దర్కముచేత సాధించుటకు శక్యము కాదు. తర్కాన్తరముచే నాతర్కము ఖండింపఁబడును.

